ఉ॥ పెన్నిధిఁగన్న పేదవలె ♦ వేడ్కఁ గనుంగొని వారు వేఁడి రా
వెన్నుఁడు మాఘసువ్రతము ♦ వేమఱుఁ జేయుచుఁ దన్నుఁగోరు నా
యన్నులమిన్నలం గలిసి ♦ యబ్రముగొల్పెడి రాసకేళులన్
గ్రన్ననఁ దేలి తృప్తిపడెఁ ♦ గౌఁగిళులన్ మఱిఁ జుంబనంబులన్. ౧౨౮

తే॥ ఇటుల నమరాంగనలతోడ ♦ నెల్లసురలు, క్రీడలాడిన మాడ్కి నా ♦ చేడియలను
గూడి బృందావనిన్ హరి ♦ యాడినకతఁ, జెప్పితిని నింక విను వ్రజ ♦ స్త్రీలకథల.

## దివ్యాత్రిగుణవృత్తి గోపికోపాఖ్యానము.

తే॥ శాంతి వీతిహోత్రాగ్నిభు ♦ క్సాంబు పావ, నశ్రుత శ్రీకర వ్రజ ♦ నాథ గోప
తులను నుపనందు లా వ్రజ ♦ స్థలిఁ బుట్టి, బలయశోధనసుతశీల ♦ కలితులైరి.

తే॥ వారి భవనంబులందు శ్రీ ♦ పరమపురుష, వరముచే దివ్యలును నది ♦ వ్యలును భూమి
గోపికలును ద్రిగుణ వృత్తి ♦ గోపికలును, బుట్టిరో మిథిలేశ్వర! ♦ పుణ్యపురుష!

క॥ రాధాసమరూపంబును, రాధాగుణ వేషములను ♦ రాధావృత్తిన్
రాధానాథ ప్రేమయు, రాధాస్నేహంబు గలిగి ♦ ప్రబలిరి వారల్. ౧౨౯

ఆ॥ ఒక్కదినమునందుఁ ♦ నక్కీర్తిసుందరీ, తనయ యైన రాధ, ♦ వనజనయను
పైని ప్రణయ కోప ♦ మూని యారాసేశు, రాసరంగమందుఁ ♦ బాసియేగె.

తే॥ అంత శ్రీకాంతుఁ డదిగని ♦ యామె కోప, మార్ప మానవతీ హృద ♦ యాపహారి
హేలాలికోచిత వేషంబు ♦ గ్రాలఁ దోఁట, కేగె వారది గని రాధ ♦ కిటుల ననిరి.

మ॥ కరభోరూ! వ్రజసుందరీమణి! జగ ♦ త్కల్యాణసంధాయినీ!
సరసుం డంబుజలోచనుం డమృతని ♦ ష్యందాస్యుఁడున్ బాలభా
స్కరసామ్యాంగదమౌళికుండల పృథు ♦ గ్రైవేయకావాపకో
ద్ధురుఁడున్ హేమపటుండు నా హరి యదే ♦ తోతెంచె వీక్షింపుమా! ౧౩౦

శా॥ ఆభీరాగరుకుంకుమాదిరసలి ♦ ప్తాకారుఁడై రాసకే
ళీభాగ్యావధిలాలసుండు నయి చె ♦ ల్మిన్ హేలాలికోద్ధర్షమం
దాభోగంబును జెంద నాతఁ డల యు ♦ ద్యానంబునన్ వంశితో
నాభాషాసతి మెచ్చఁ బాడెడి నహా ♦ యావైపునం జూడుమా! ౧౩౧

ఉ॥ నల్లని ముంగురుల్గలిగి ♦ నవ్యవయోన్మదఘూర్ణితాక్షుఁడై
నల్లని రూపునన్ వెలిఁగి ♦ నాతుల ప్రీతికి మూలబంధమై
యుల్లస ముల్లమం దలర ♦ నొప్పిన యప్పరమేశుఁ గాంచుమా!
నల్లలితాను రాగమునఁ ♦ జయ్యన నాతని పొంత కేగుమా! ౧౩౩

ఉ॥ లెమ్ము ద్రుతంబునం జనుము ♦ లేమలచేతఁ ద్వదీయరమ్య దే
హమ్ము నలంకరించు మల ♦ యత్తరు గంధము పుష్పవారులన్

ఘుమ్మను నట్లు జేయుమిఁక ♦ గోపము వీడుము కృష్ణచంద్రు మో
దమ్మునఁ గూడి రాసములఁ ♦ దద్దయు జేయుము రాధికాంబరో! ౨౩౪

ఉ॥ ఈసమయంబు మంచిదని ♦ యెంచుము క్రమ్మఱ నిద్దిరాదు సం
తోసముతోడ నుండు మనఁ ♦ దోయజలోచనయైన రాధ చే
టీసముదాయముం గలిసి ♦ టెక్కున హోలి మహంబుఁగాంచు పే
రాసను లేచి కిన్కవిడి ♦ యావని కేగె ననంతరంబునన్. ౨౩౫

వ॥ పూర్వోక్తలును, దత్సఖీలలామలును, గుంకుమసంకుమదగోరోచనాహరిద్రాగరుకస్తూరీశ్రీఖండాది రసపూరితదృతిసమేతలును, నగు నావ్రజాంగనలంగదపాదాంగదకాంచీకంకణతాటంకహారతారాద్యాభరణంబులం దాల్చి పచ్చని వలువల ధరించి స్వీయకోమలశోణహస్తంబుల నాభీరారుణచూర్ణమ్ములు గైకొని భూనభోభాగంబులు సంధ్యారాగంబు విడంబించున ట్లెల్లెడఁ జల్లి కోకిలస్వనంబులో హోలికాగీతంబుల గానం బొనర్చుచు ఫుల్లసరోజలోచనుండగు వల్లవకులజలధిహల్లకప్రియుపై వసంతంబుఁ బోసి కుంకుమపటీరాగరుచూర్ణములను బలుమఱు విసరి యొకసక్కియమాడుచుఁ జనవుమీఱ డాయుచు నడుమనడుమ భయంపడుచు నాతని నగుమొగంబును ముద్దులాడుచు యథేష్టంబుగా విహరింపుచుండ నక్కమలాక్షుండును మిక్కిలి సంతసించి యా సతీమణుల కందఱ కన్నిరూపులతో దైవారి చూపఱులు తటిద్ఘనులని యగ్గలంబుగ నగ్గింప రాథాదేవితోడం గూడి తదుత్సవంబు సంపూర్ణంబుగా నడిపించి తద్ధస్తకృతాక్తనేత్రుండై స్వకీయంబగు నుత్తరీయంబును గుఱుతుగా నావిరిఁబోఁడుల కొసంగి యటనుండి వెడలి నందభవనంబున కేగె. వెండియుఁ జతుష్పదార్థప్రదంబగు దేవకన్యాగోపికాచరితంబు వినిపించెద వినుమని యిట్లు చెప్పందొడంగె. ౨౩౬

## దేవకన్యాగోపికోపాఖ్యానము.

ఉ॥ క్రాలుఁగదా కుబేరసమ ♦ రైరుచిరుండు వ్రజప్రభుండు గో
పాలుఁడు కీర్తివంతుఁడు ది ♦ వస్పతినామక వీరుఁ డొక్క వే
గోలలఁ బెండ్లియాడి బుధ ♦ కోటులు మెచ్చఁగ ధర్మపద్ధతిన్
మాలవదేశమేలుచు స ♦ మస్తసుఖంబులఁ బొందుచున్ ప్రభూ! ౨౩౭

తే॥ అతఁడు సంసారజనితపా ♦ పబ్ధినీఁదఁ, జాలినది మఁజ్జగంబులన్ ♦ సజ్జనసహ
వాస నౌకయ యొక్కటి ♦ వఱలెనంచు, విజ్ఞులగు బ్రాహ్మణులచేత ♦ విని కడంక. ౨౩౮

తే॥ అఖిల భార్యలఁ దోడ్కొని ♦ యాత్మగృహము
నుండి వెడలి క్రమంబుగా ♦ దండివైన
తీర్థములఁ గాంచి సేవించి ♦ దివ్యమధుర
కేగి యందలి వింత లీ ♦ క్షించి యచట. ౨౩౯

తే॥ గోకులంబున బుధుఁడు యో◆గ్యుండు నైన, నందభూపుఁడు గలఁడని◆నాగరకుల
వలన విని యా యశోదేశు◆పజ్జకరిగి, కనియు బృందావన శ్రీనిఁ◆గాంచి యవల.

క॥ నందుని యానతిఁ గొని యా,నందముతో రమ్యయోజ ◆ నద్వయదేశం
బొందుచు బృందావనిలో, మందిర మొక్కండుగట్టి ◆ మనికి నొనర్చెన్. ౨౮౧

క॥ బృందిష్ఠంబగు గోష్ఠం, బందముగా నొకటి గట్టి ◆ యాతఁడు దివిష
త్సందోహాధిపువలె నా,నందముతో నుండ నిజ జ ◆ నంబులతోడన్. ౨౮౨

క॥ దేవలవాక్యము చొప్పున, దేవాంగన లాత్మజలుగ ◆ దివ్యాకార
వ్యావృతలై పుట్టియు సిత, జైవాతృకు పగిదిఁ బెరుఁగు ◆ సమయంబందున్.

క॥ మోహనరూపుండగు నా, శ్రీహరినిం గాంచి మరులుఁ ◆ జెంది వివశలై
యా హరినిం గూడుట క,వ్యాహతవిధి మాఘమాస ◆ మందలి వ్రతమున్.

ఉ॥ మోదముతో నొనర్చుటకుఁ ◆ బ్రొద్దున నిద్దురలేచి భాస్కరా
ర్ధోదయవేళ నా యమున ◆ యొద్దకుఁ బోయి మునింగి యం॰సు దా
మోదర చిత్రలీలల నె ◆ హో యన నుచ్ఛ్రియఫక్కి గానవి
ద్యాదయితామతల్లికయు ◆ హర్షము జెందఁగఁ బాడి రయ్యెడన్. ౨౮౫

తే॥ తమ్మికంటి ప్రసన్నుఁడై◆తద్వ్రజాంగ,నలను జీరియు నిట్లనె◆జెలువలార!
యిారు కోరెడి వరమేదొ◆యెఱుఁగఁ జెపుడి,యేనొసంగెద నెంతటి◆దైనఁ గాని.

చ॥ హరి నుడి విన్న యా సతులు ◆ హర్షముఁ బొంది మహాత్మ! యారయన్
బరుఁడ వజుండ వాద్యుఁడవు ◆ బ్రహ్మవు మన్మథ మన్మథుండ వ
క్షరుఁడవు మాన్యలభ్యుఁడవు ◆ కారుణికుండవు భూమిభారసం
హరుఁడవు సర్వనాయకుఁడ ◆ వైన నినుం గను భాగ్య మబ్బెఁగా. ౨౮౭

చ॥ జలరుహనేత్ర! మాపయినిఁ ◆ జక్కని యక్కటికంబె యున్నచో
జలజము బెత్తమున్ మురళి ◆ సంఘటిలన్ నవహాటకాంబరం
బులు దగ మోమునన్ నగవు ◆ మొల్కలనెత్తఁగఁ బింఛ మొప్ప భూ
షలు సెలువార సన్నటుని ◆ చందమునన్ గనిపించుచుండుమిా. ౨౮౮

తే॥ ఇంతకంటెను బరవరం◆బెదియువలదు, శ్రీకరా! యన్న నాతఁ డం◆గీకరించి
హర్షమిడుచుండె సాంఖ్యాదు◆లందలేని, శౌరిభ క్తవశుఁడయి చె◆న్నారఁడొక్కొ?

## జాలంధరీగోపికోపాఖ్యానము.

క॥ మఱియును జాలంధరులగు, తరుణుల చరితంబు నుడివె◆దన్ దీని విన్న
బురుషార్థంబులు గలుగును, బరమును జేకూరునయ్య! ◆ బహులాశ్వవిభూ!

తే॥ సప్తశైవలినీతీర◆సముపగతము, సర్వసంపద్యుతంబు యో◆జనయుగాన్వి
తంబు సర్వకల్యాణప్ర◆దంబునైన, రంగనామకపురము వె◆లుంగుచుండు.

క॥ ధనధాన్యసమృద్ధులతో, ఘనుఁడౌ రంగోజినామ ♦ కప్రభుఁ డా ప
త్తనమును బరిపాలించుచుఁ, దనయులు మనుమలును గల్గి♦తనరు నరేంద్రా!

తే॥ ఆతఁడు హస్తినాపట్టణ ♦ పతికి వార్షి,కంబుగా నూఱుకోట్లరూ ♦ దంబులైన
మోహరీల్ గట్టుచుండును♦సాహసాంక,జనకభూవర! వాఁడొక్క ♦సమయమందు.

తే॥ వార్షికంబగు పన్ను గ♦ర్వంబుఁ జెంది, ప్రభువరుండగు ధృతరాష్ట్రు♦పతికిఁగట్ట
కుండుఁ బేకాక యాతని♦దండకుఁ జని,కలిసి మాటాడకుండె న♦క్కారణమున.

తే॥ హస్తినాపురనేతయు ♦ నాగ్రహించి, శూరవరులైన పదివేల ♦ జోదుల నల
గోపనాయకుండైన రం♦గోజికడకుఁ, బన్ను గొనిరండు పొండని♦పంప వారు.

చ॥ సరగునఁ బోయి సంకెలలఁ ♦ దత్పతిచేతులకుం దగిల్చియుఁ
గరముగఁ ద్రాళ్ళతో నతనిఁ ♦ గట్టి కరీంద్రపురంబుఁ జేర్చి వే
చెఱఁ బడవైచి తిట్టిరి క ♦ సిఁ బ్రబహరించిరి కాని యాతఁ డా
కరినిగమాధినేత కొక ♦ గవ్వయు నియ్యఁ డదెట్టి దండియో. ౨౧౬

ఉ॥ ఇట్టులఁ గొంతకాలము గ ♦ తింపఁగ నొక్క నిశీథమందు నా
దిట్ట మహాభయంకరము ♦ దీర్ఘమునా చెఱసాలనుండి తా
నెట్టులొ పాఱిపోయి తన ♦ యింటికిఁ జేరెను ధారుణీశ్వరా!
జెట్ట లొనర్చు చేఁతలను ♦ శేషుఁడుసైత మెఱుంగ శక్తుఁడే? ౨౧౭

తే॥ పిదప ధృతరాష్ట్రుఁ డావార్త ♦ వినియు మరల
నాతనిం గట్టి తెచ్చుట ♦ కతిశయబల
సంయుతాక్షౌహిణీత్రయ ♦ సైన్యమంపె
నంత నది యొక్కగడియలో ♦ నటకు నరిగి. ౨౧౮

క॥ రంగపురాధీశ్వరుఁడౌ, రంగోజిని ముట్టడించు ♦ రాఁగా నతఁడుఁ
గ్రుంగక యక్షౌహిణితోఁ, బొంగుచుఁ దద్రిపులతోడఁ ♦ బోరఁగఁ జనుచుఁ.

మత్తకోకిల॥ శాతహేతికృపాణముద్గర ♦ సంచయంబును వైరిపా
దాతికావళి పైనివేయఁగఁ ♦ దత్క్షణంబున వారు త
త్పూతరథ్యశతాంగ కేతన ♦ శూరులఁ బ్రటిలోన ని
ర్భీతిగాఁ దెగటార్చి గోపకుఁ ♦ బట్టుకట్టఁ దలంచుచుఁ. ౨౨౦

ఆ॥ రంగపురవిభుఁడగు ♦ రంగోజి కనుఁగొని, యుద్ధరంగము విడి ♦ యునికి కేగి
లేని చలము బలము♦బూనుచుఁ గ్రమ్మఱఁ,గొలఁది దినము లాజి♦సలిపి యవల.

ఉ॥ నాకు బలంబు లేదు మఱి ♦ నమ్ముటకుం దగినట్టి సైనికా
నీకము గూడ లేదిలను ♦ నేనిఁకఁ దక్కనటంచుఁ దొడ్డనే
కాకలమొందు చేరఁగొని ♦ కల్గిన వార్తల వ్రాసి దూతతోఁ
బ్రాకట దిగ్విజేత యదు♦రాజగు కంసుని కంపె నావలఁ. ౨౨౧

ఉ॥ దూత మనోజవంబున య ◆ దుప్రభుసన్నిధి కేగి భక్తితో
జోతల సల్పి యిట్లనియె ◆ శూరవరా! యొక జాబు వ్రాసి మీ
చేతికి నిమ్మటంచు రిపు ◆ సేనలచే వెతఁ జెంది మీదు చే
యూఁతను గోరు రంగనగ ◆ రోత్తమనాయకుఁ డంపె నన్నిటుల్. ౧౬౩

ఉ॥ కావున నిట్టి జాబు గొని ◆ గాలివలెన్ జనుదెంచి మా విభున్
బ్రోవుము జాగు మానుము వి ◆ రోధిభయంకరవీర! నీవు దీ
నావనతత్పరుండవు గ ◆ దా యమరాసురమానవాళి ని
ర్జీవముగా నొనర్పవొకొ? ◆ చెప్పఁగలాఁడనె నీ సమర్థతల్. ౧౬౪

ఉ॥ ఆఁకటఁ బీడ జెందు నరుఁ ◆ డన్నము జూచెడి మాడ్కి దప్పిచే
నాకులమొందుచుండు జనుఁ ◆ డంబువు గాంచెడిభంగి స్తోకకా
స్తోకము శారదాభ్రగణముఁ ◆ జూచెడిరీతిఁ జకోరకంబు దో
షాకరుఁ గాంచు నట్లతఁ డ ◆ జస్రము జూచెడి మీదు రాకకై. ౧౬౫

ఉ॥ మీరటు కేగుదెంతురను ◆ మేలిమి వార్తను నాలకించినన్
సూరునిఁ జూచి పద్మములు ◆ శోభను బొంది ముదంబుగాంచిన
ట్లారమణుండు సారెకును ◆ హర్షము జెందఁడె? కంసభూవరా!
శూరవరాగ్రణీ! యనుచు ◆ జోతములం బొనరింప నాతఁడున్. ౧౬౬

తే॥ మానసంబున యోజించి◆మనుజభర్తృ, కులగు కోటిదానవులతోఁ◆గూడికొనుచు
రంగపట్టణపతి యుద్ధ◆రంగమునకు, నేగి రంగోజిఁ గాచెదఁ◆నే నటంచు. ౧౬౭

సీ॥ గోమూత్రసిందూర ◆ గోరోచనా మృగ, నాభిపత్రాంచితా ◆ ననముతోడ
విశ్వభయంకర◆వింధ్యమహీధ్రసా, మ్యాయతోచ్ఛ్రాయ దే◆హంబుతోడ
నభ్రభారవానుకా ◆ ర్యద్భుత శృంఖలా, క్రమబద్ధ దీర్ఘపా ◆ దములతోడ
శత్రునాశంకర ◆ చాణూరముష్టిక, శలకూటముఖ నిజ ◆ సఖులతోడ

తే॥ భీకరంబగు కువలయా◆పీడకరిని, నెక్కి మదధారలున్ సెల ◆ యేళ్ళుగాగ
గండపుటముల వెంబడిఁ◆గాఱ వెడలి, రంగపురి కేగె రిపులతోఁ◆రణముజేయ. ౧౬౮

క॥ పదపడి యదువరువీరులు, మదమునఁ గుంతత్రిశూల ◆ మార్గణనిస్త్రిం
శదళములను బలుభంగులఁ, గదనంబును సల్పిరి జన◆కధరాధీశా! ౧౬౯

ఉ॥ అత్తఱి బాణసంతమస ◆ మావహ భూమిని గ్రమ్మఁ గంసుఁడున్
గత్తళమొందు వేసికొని ◆ కాఱడవిన్ జను చిచ్చువోలెఁ జే
రెత్తిన ముద్గరంబు గొని ◆ యేత్తెఱఁ గౌరవసేనఁ జొచ్చి ప
ల్లుత్తునియల్ బొనర్చెఁ బవి◆తో హరి కొండలఁ గొట్టినట్టులన్. ౧౭౦

క॥ యదుపతి పదపడి పదముల, నెమరుల యరదములఁగూల్చి◆యిభములఁ దనదా
మదకరిచేఁ ద్రొక్కించియు, సదమదము జేసె తురగ ◆ జాలముఁ దోడ్తోన్. ౧౭౧

ఆ॥ వె॥ వైరివరుల దివికిఁ ♦ బాఱనైచియుఁ దిర్గి
కొనుచుఁ బరిహసించి ♦ గొడుగు లెక్కి
యముల ఛత్రచామ ♦ రముల, నరాతుల
మూఁపులందుఁ బెట్టి ♦ మోయు మనిమె. ౨౨౨

సీ॥ ఘంటికానిస్వన ♦ కప్రసగజంబుల, గోటమీఱెడి వ్యోమ ♦ కుత్సితుండు
పశ్చిమాంఘ్రిద్వయ♦బలమున మావులఁ, ఘనులఁ ద్రోయును గేశి♦కర్బురుండు
సాళ్వరథంబులఁ♦హస్తంబులనుబట్టి, యట్లిటుల్ ద్రిప్పు వృ♦షాసురుండు
ముష్టిబలంబున ♦ మొనకాండ్రతలలపై, మొట్టికాయలవేయు♦ముష్టికుండు
తే॥ మఱియు నానావిధంబులఁ ♦ మనుజభక్ష
కులగు దైత్యులు చెలరేగి ♦ కలనులోన
జంపుచుండుట మిగిలిన ♦ శత్రుసైని
కులు గనుంగొని పరుగిడి ♦ రులుకుఁ జెంది. ౨౨౩

ఉ॥ ఆజి భయంకరుండయిన ♦ యా యదువీరుఁడు శత్రుసేన లా
యోజఁ బరుంగిడఁ సలిపి ♦ యుద్ధము మాని స్వకీయసైన్యవి
భ్రాజితుఁడౌచు దుందుభులు ♦ బల్మఱు మ్రోయఁ గుటుంబయుక్తరం
గోజినిఁ గొంచు నామధుర ♦ కుం జనె మిత్రులు మెచ్చ నిచ్చలఁ. ౨౨౪

చ॥ అల ధృతరాష్ట్రభూమివిభుఁ ♦ డాత్మపరాజయ మాలకించి యో
ధుల నిసుమంత దూఱి రిపు ♦ దుర్భర దోర్బల గర్వభంగముఁ
సలుపఁగ నిశ్చయించుకొని ♦ చక్కని కాలము గుత్తెఱుంగఁగాఁ
బలుమఱు వేగులఁ బనిపి ♦ వార్తలెఱుంగుచునుండె భూవరా! ౨౨౫

తే॥ అంతఁ గంసుండు గోకులం♦బందు బర్హి,షదమ నెడిపురి రంగోజి♦యదువిభునకు
నిడఁగ నాతండు గైకొని♦యెలమిత్రోడ, వాసమును జేసె నిజకుటుం♦బమునుగూడి.

తే॥ ఈరహిఁ గొన్ని దివసంబు♦లేగ నతని, లలనలందున జాలం ధ♦రులును హరి వ
రమునఁబుట్టి మనోజ్ఞలై ♦విమలమతుల, గోపకులఁ బెండ్లియాడియుఁ♦గోర్కితోడ

తే॥ జారధర్మంబుఁ జేపట్టి♦చక్రపాణి, తోడ స్నేహించి రద్దానఁ♦దోయజాక్షుఁ
డట్టి బృందావనంబున♦నాసతులను, రాసములఁ దేల్చెఁ జైత్రిక♦మాసమందు.

సముద్రకన్యకాది గోపికోపాఖ్యానము.

వ॥ మఱియు నాగోకులంబునందు శోణపురాధీశ్వరుండును, శ్రీమంతుండును, ధీమంతుండును, నీతిమంతుండును, సర్ధవంతుండును, బలవంతుండు నగు నందుం డను గోపకుం డైదువేల యతివలం బెండ్లాడి యింద్రభోగంబు లనుభవించుచుండ నతని సతులయందు శ్రీమత్స్యమూర్తి వరంబునఁ నపాంపతి సముద్భవలగు ముగుదలును, బృథ్వీదోహనంబునఁ జితవిచిత్రౌషధులును, బృథువరంబున బర్హి

ష్మతీపురభామినులును, నరనారాయణమహామునివరంబున నచ్చరలును, వామనుని వరంబున సుతలనివాసినులగు విలాసినులును, శేషుని వరంబున నాగకన్యక లుద్భవిల్లిరి. అవ్వారలకు మహాయోగిపుంగవుం డగు దుర్వాసుం డద్భుతమహిమోపేతంబును, వాంఛాప్రదంబును నగు యమునాపంచాంగం బను మహామంత్రంబు నుపదేశింపఁ దల్లతాంగులు శ్రీకృష్ణప్రీత్యర్థంబై నిశ్చలభక్తిఁ నందనందనమహిషియగు నా కళిందనందనను బూజించి యామంత్రం బుపాసింపఁ దద్ధునీశ్వరి ప్రసన్నయై యడిగిన వరంబుల వారి కొసంగె. తదుపరి మదనమోహనుండగు నా శ్రీకృష్ణుండు మాలతీమల్లికాపారిజాతకేతకీపద్మకువలయముఖకుసుమపరిమళభరితంబును, కోకిలపుంస్కోకిలకోకకేకీ శుక పిక మరాళపాళి మధుస్వనమనోహరంబును, మధుపధ్వనిమధురంబును, గాళిందీజలకల్లోలకోలాహలసమాకులంబును, వసంతలతికామనోహరంబును, జిత్రవిచిత్రంబును, బవిత్రంబును గల్యాణకరంబు నగు బృందావనంబందు మలయమారుతంబు మందగతిని విసరఁ గల్పవృక్షాంతికంబునం జెలంగు కదంబతరుమూలంబున నొంటిగా వ్రేతలంగూడి మధుమాసంబునందు మోహపాశబద్ధంబును, గోపికామనోరథానురూపంబు నగు హోలికోత్సవం బారంభించె. అంత నాయింతులా యనంతునితోఁ దత్ఖేలనం బొనర్చి సంతుష్టాంతరంగలైరి. అత్తఱి రాధాసహితుండగు కృష్ణుండు రతితోఁగూడు పుష్పబాణునిఁ దిరస్కరించుచుఁ దేజరిల్లె. వెండియు నా నాగకన్యకలు బలభద్రరూపుండగు హరినింగూడి తదుత్సవంబు దివిజనేత్రపర్వంబుగాఁ గావించి సంతసించిరిగాదె? దేవరాజబ్రహ్మర్షి వరేణ్యదుర్లభుండగు నాభగవానునిగూడు చేడియల భాగధేయం బెంతింతయని చెప్పంగలమే? భూపా! పాపహరంబగు గోపికలచరితంబుల వినిపించితి. ఇంక నీవేమి వినవలతువో తెల్పుమని యడుగ నారదునకు జనకుం డిట్లనియె.

తే॥ నారదా! యట్టి గోపీజనమున కల్ల, యనఘుఁడైన దుర్వాసుఁడన్ ♦ మునివరుండు
యమసహోదరీపంచాంగ ♦ మమలబుద్ధి, నిచ్చెనని చెప్పితివె యైన ♦ నిప్పు డీవు.

## యమునా పంచాంగము.

మ॥ సదయాంతఃకరణుండ వౌచు యమునా ♦ సౌభాగ్య పంచాంగ మె
య్యదియో దానినెటుల్ జపింపవలెనో ♦ యద్దానిచే నేఫలం
బొదవున్ మున్నిది యేరుసల్పి రను స ♦ ర్వోదంతముల్ బల్కవే!
మది యానందమహాసుధాజలధిలో ♦ మగ్నంబుగా నారదా! ౨౮౧

మ॥ శ్రుతులారన్ విని నారదుం డిటుల వా ♦ క్రుచ్చెన్ దమిన్ దీని కొం
డితిహాసంబు వచించెదన్ వినుము భూ ♦ మీశా! యయోధ్యాపురీ
పతియున్ రాజవరుండు దివ్యధనియున్ ♦ బాహాబలాఢ్యుండు స
న్మతిమంతుండును సత్ప్రవర్తకుఁడు నౌ ♦ మాంధాత నా నొప్పెడిన్. ౨౮౨

ఉ॥ ఆ యనఘుండు వేడ్కయి యాత్మగృహంబును వీడి కానకున్
జాయఁగఁ జేరి తిర్గుచల సౌభరినామక మౌని యాశ్రమం
బాయతబృందకావనము నందుఁ జెలంగుట గాంచి మెల్లఁగా
నామెడ కేగి యుల్లుఁడగు నామునికిన్ నతిజేసి యిట్లనెన్. ౨౮౩

శా॥ మౌనీ! నీవు పరావరజ్ఞుఁడ వసా మాన్యుండ వార్యుండ వ
జ్ఞానాంధాన్విత లోకభాస్కరుఁడవో జామాత! యీవిప్ప డె
ద్దానన్ రాజ్యసుఖంబులన్ జెలఁగి యీ దైత్యారి సారూప్యమున్
సానందంబుగఁ జెందఁ జాలుదునొ నా కద్దాని వాక్రువ్వుమా! ౨౮౪

క॥ అనవుడు సౌరభి యిట్లనె, వినతారక లెంతకాల మెసఁగెడినో యం
దనుకను రాజ్యంబిడి తుద, వనమాలినిఁ జేర్చు యమున పంచాంగంబే.

క॥ వివరించెద నని వినుమా, స్తవ పటల సహస్రనామ సరణి కవచముల్
గవిసిన నది పంచాంగ మ,ని విబుధు లనుచుందురు తర ణికులశశాంకా!

తే॥ అనఁగ మాంధాత క్రమ్మఱ నడిగె నిట్లు, సౌభరీ! యమునా కవచంబుఁ దెలుపు
మది యనుష్ఠింతు భక్తితో ననఁగ మునియు, మఱియు నిట్లనె నతనికో మానవేంద్ర!

తే॥ సర్వరక్షాకరంబును సకలశుభద, మైన కాళింది కవచంబు ననెద వినుమ!
యగ్రజుండు చతుర్భుజ నబ్జనయన, స్యందనస్థను శ్యామను యమునఁ దలఁచి.

తే॥ శైవలిని యందు వేకువన్ జలకమాడి, సిగను ముడిచియుఁ బూర్వదిక్కునఁగుశాస
నమునఁ గూర్చుండి సంధ్య సక్రమముగాను, సల్పి యమునాకవచమిద్ది చదువనగును

## యమునా కవచము

సీ॥ మా॥ యమునాస్రవంతి శీర్షమును రక్షించుత, కృష్ణ కన్నులను రక్షించుఁగాత
శ్యామయు భ్రూదేశ మోముత నాసికన్, స్వర్గవాసినియుఁ గాపాడుఁగాత
దౌడల రక్షించు తన్ మోదరూపిణి, హృది మహానదియు రక్షించుఁగాత
జక్రివామాంసజ శ్రవణముల్ ప్రోచుత, గాళింది యధరముల్ గాచుఁగాత
రవిసుత చిబుకంబు రక్షించుతన్ యమ, భగిని కంధరము గాపాడుఁగాత
కృష్ణప్రియాంగన పృష్ఠంబు ప్రోచుతన్, భుజములన్ దటినియుఁ బ్రోచుఁగాత
నూరువుల్ రంభోరు వోముతన్ జానువుల్, పాదభేదినియుఁ గాపాడుఁగాత
ఘుటికలన్ బ్రోచుత గోర్కి రాసేశ్వరి, కలుషహారిణి కాళ్లఁ గాచుఁగాత
నంతర్బహిరధోర్ధ్వ హరిదుపదిశలన్ బ్ర, పూర్ణతమప్రియ ప్రోచుఁగాత

తే॥ సర్వదా సర్వథా సర్వసమయములను, జక్కఁగాఁ బ్రోచుగావుత సకలలోక
మాత మాతల్లి మాకిటన్ బ్రీతితోఁ బ్ర, సన్నయై మ్రొక్కులం గొని సాకుగాత.

క॥ ఇది యమునాకవచంబును, బదిమారులుఁ బరమభక్తిఁ బఠియించిన య
ట్టినరోత్తముండు ధనధాన్యసంపన్నుఁడై వఱలి కడను గేవలముందున్. ౨౧

తే॥ బలియు బుద్ధిమంతుఁడు నైన ♦ బ్రహ్మచారి
నియతితో మితాశనుఁడయి ♦ నెలలు మూఁడు
జరుగునందాఁక దీనిని ♦ జదువ నోతఁ
డఖిల రాజ్యాధిపత్యంబు ♦ నందఁ గలఁడు. ౨౯౨

తే॥ మూఁడు నెలలలో నిశ్చల♦బుద్ధి నిద్దీ, నూటపదితడవలు మంచి♦చోటునందుఁ
జేరి చదివిన వారికి ♦ సిద్ధిగాని,విషయ మేదియు నుండదో ♦ విమలచరిత! ౨౯౩

తే॥ ఎవఁడు ప్రొద్దున మేల్కాంచి ♦ కృష్ణదర్శ,నాదికారణమగు దీని ♦ నధికభక్తిఁ
జదువునో యాతఁ డైహిక♦సౌఖ్యములను,జెంది గోలోకమున కేగి♦చెన్నువిహారు.

తే॥ అనఁగ మాంధాత యిట్లనె ♦ యమునయొక్క
సర్వసిద్ధికరంబగు ♦ స్తవముఁ బలుకు
సౌభరీ! యన్న నాతఁడా ♦ జనవిభునకు
స్తవము నుడువంగఁ దొడఁగెనో ♦ జనకరాజ! ౨౯౫

## యమునాస్తోత్రము.

తే॥ పద్మనాభవామాంససం♦భవకుఁ గొల్పు, కృష్ణకాంతకుజోతంబు శ్రీ♦కృష్ణరూపి
ణికి జోహారువు కాళింది ♦ నిర్ఘరిణికి, జాగిలిఁ భక్తితోడుత ♦ సల్పుచుంటి.

క॥ సిలుగు సుజనులకుఁ గూర్చెడి, తులువలు కాముకులునైన ♦ దుష్టులు త్వద్భ
క్తులుగానైరేఁ వారిని, సలలితమతి సాకు నీకు ♦ సల్పెదఁ బ్రణతుల్. ౨౯౭

తే॥ కృష్ణ! కృష్ణస్వరూపవు♦పృథులతరంగ, ములను గూర్మావతారుఁడు♦సెలఁగుచుండుఁ
బ్రబలయమునవుత్స్యమూర్తివై♦నిలుతువుప్రతి,బిందువందుగోవిందుఁడు♦వెలుఁగుచుండు

శా॥ అమ్మా! దేవపురుల్ యథాయథలుగా ♦ నబ్జోద్భవాండంబు ఖం
డమ్ముల్ గాఁగ గిరీంద్రభూమిరుహకు ♦ డ్యశ్రేణిదుర్గోరుకూ
లమ్ముల్ గూల జవంబునన్ విరజ ను ♦ ల్లంఘించి లోకమ్ముఁ బూ
తమ్ముఁగా సల్పుచుఁ బాఱుచుంటి వినె జో ♦ తల్ నీకు లీలావతీ! ౨౯౯

శా॥ ఫుల్లాబ్జాయతనేత్ర వామభుజసం ♦ భూతా! విభూతీశ్వరీ!
తల్లీ! గోపకగోపికాసురభివ ♦ త్సశ్రేణిసంరక్షణా
భ్యుల్లాసా! యరవిందమిత్ర తనయా! ♦ పూతా! జగన్మోహినీ!
కల్లోలాకర! మేఘవర్ణరుచిరా! ♦ కావింతు నీకంజలుల్. ౩౦౦

ఉ॥ జీవనజోత్పలాది బహు ♦ చిత్రసుమంబులఁ జూత నారికే
ళావనిజంబులన్ మిగుల ♦ హర్షము గూర్చెడి తీవెలన్ బ్రమో
దావహమైన కుంజముల ♦ నందముఁ జెందెడి బృందకావనిన్
డీవిఁ దలిర్పఁ జేరుచుఁ గ ♦ డిందిగ మెచ్చెడి నిన్నుఁ గొల్చెదన్. ౩౦౧

సీ॥ కోవిదసుర్లభ! ♦ గోలోకమున నీవె, యుత్తమవై సత ♦ మొందుదమ్మ!
బాధాకరంబులౌ ♦ పాపౌఘువులకెల్ల, దర్వీకరంబవై ♦ తనరితమ్మ!
గోవిందసంగత ♦ గోపకగోపికా, కుర్దనకలితవై ♦ కుదిరితమ్మ!
జలలోలకల్లోల! ♦ సంచయ కోలాహ, లాంచితవై లలి ♦ నలరితమ్మ!
ఆ॥ సకలజగములందు ♦ సౌందర్యవతివమ్మ!, సుమతివినుతవమ్మ! ♦ విమలరూప
వమ్మ! యాదిదేవు ♦ నర్ధాంగివో యమ్మ!, నిన్ను నమ్మియుంటి ♦ నన్నుఁ బ్రోచు.
క॥ యమునా నామముఁ దాల్చితి, నమరులు మీపేరుఁ దలఁచి ♦ యఘనగములఁ జూ
ర్ణము గావింతురు తల్లీ!, యమభగినీ! భక్తి నిన్ను ♦ నారాధింతుర్. ౩౦౩
ఆ॥ నీకు నన్నమైన ♦ యా కృతాంతుండును, నిన్ను దలఁపనట్టి ♦ నీచజనుల
నరగఁ గొట్టగఁ బ్ర ♦ చండనాముండయి, దండముఁ గొని పురిని ♦ మెందు దిరుగు.
తే॥ విషయకూపములఁ బడి ♦ వెతలఁ గుడిచి, వేమఱుఁ విసువొందెడి ♦ వెఱ్ఱుల పయి
నీ కటాక్షరజ్జువు బడ్డ ♦ నిముసమున నె, లేచి వారు కేవలమును ♦ జూచుచుండ్రు.
తే॥ శ్రీవిరాణ్మూర్తి విస్తృత ♦ శీర్షమందు, వేణిరూపకమాలగా ♦ వెలుఁగుచుంటి
వమ్మ! నీగుణమందు నా ♦ వంతయేని, శేషుఁడుఁ వర్ణనంబును ♦ జేయఁగలఁడె?
తే॥ ఇట్టి నీవు కృపామతి ♦ నెచట నెచటఁ, బాఱుచుందువో యందందు ♦ వఱలు నరుల
భాగ్యమేమని చెప్పనౌ ♦ భానుతనయ!, మోడ్పులొనరింతుఁ గైకొని ♦ ప్రోవవమ్మ!
తే॥ ఇట్టి యమునాస్తవంబును ♦ నేజనుండు, వేకువను లేచి పూర్వోక్త ♦ విధిగ భక్తి
జదువునో వాఁడు జగతికి ♦ సౌఖ్యమొసఁగి, భోగములఁ బొంది గోలోక ♦ మునకు నరుగు.

## యమునా పటల పద్ధతులు.

వ॥ అనవుడు మాంధాత యానందించి మహాత్మా! యనుగ్రహించి కామప్రదంబులగు కాళిందీపటల పద్ధతులను బోధింపవేఁడితి నన నమ్మునివరుండు విని జనవరా! తద్యమునాపటలంబున కాదియందుఁ బ్రణవంబును జేర్చి మాయాబీజం బుద్ధరించి రమాబీజం బనుసంధించి కాళిందీదేవి యనుదానిని జతుర్థ్యంతంబుగాఁ జేసి దానికి నమశ్శబ్దంబు గూర్చిన మహామంత్రంబగుం. తన్మంత్రం బేకాదశలక్షావృత్తులు జపించిన సిద్ధించి. వాంఛాప్రదంబగు శుభకరంబగు నొక్కసింహాసనంబున షోడశదళపద్మంబును వేసి మధ్యభాగంబునఁ గర్ణికను జిత్రించి యమునాసహితుండగు శ్రీకృష్ణుని మనోహరంబుగా లిఖించి పూర్వోక్తకమలంబునందలి షోడశదళంబులందు గంగా, విరజా, కృష్ణా, చంద్రభాగా, సరస్వతీ, గోమతీ, కౌశికీ, వేణీ, సింధు, గోదావరీ, వేదస్మృతీ, వేత్రవతీ, శతద్రు, సరయూ, ఋషికుల్యా, కకుద్మిను లను నదులను వేఱువేఱుగాఁ దత్తన్నామమంత్రంబులతో షోడశోపచారంబుల నర్చించి క్రమంబుగా దిక్చతుష్టయంబునను బృందావన, గోవర్ధన, బృందా. తులసీ, దేవతలను స్థాపించి, యా మంత్రనామంబులతోఁ

బూజించి భగవతియుఁ గళిందనందినియు, సూర్యసంజాతయు, యమభగినియు, శ్రీకృష్ణ ప్రియయు, యూధీభూతయు నగు యమునకొఱకని మాటిమాటికి నుచ్చరించుచు నావాహనాద్యుపచారంబులం గావించి పైనిఁ దెలిపిన మహామంత్రంబు జపింపందగు. ఇఁకఁ దత్పద్ధతి యెట్టిదనిన తన్మంత్రపురశ్చరణంబు సిద్ధించునందాఁక బ్రహ్మచారియై మౌనంబుఁ దాల్చి యవభోజియుఁగాని పర్ణాశనుండుగాని యై నేలఁ బరుండి యింద్రియంబులను జయించి కామక్రోధాదులఁ దూరీకరించి సమర్థుండగు దేశికుని నేర్పాటుజేసికొని తదాజ్ఞానుసారంబుగా బ్రాహ్మ్యముహూర్తంబున మేల్కాంచి యమునను సన్నుతించి కాల్యంబులం దీర్చి యరుణోదయంబున నద్యాదులందు స్నానం బొనరించి నిత్యంబులగు జపతపంబులఁ నిర్వర్తించి తన్మంత్రం బనుష్ఠింపందగు. మధ్యాహ్నంబగుడు సంధ్యావందనం బొనర్చి నియమపూర్వకంబుగా నుండందగు. తన్మంత్రపురశ్చరణసమాప్త సమయంబునం బుత్రవంతులగు దశలక్షబ్రాహ్మణులను గంధపుష్పాక్షతాదులతోఁ బూజించి షడ్రసోపేతంబగు మధురాన్నం బిడి జాంబూనదపాత్రాంబరాభరణ దక్షిణల నొసంగి సంతుష్టులం జేయందగు. ఇట్లాచరించిన నామంత్రంబు సిద్ధించి బుద్ధిగతాభీష్టంబులను సిద్ధింపఁ జేయు. సందియ మావంతయు లేదు. నీవు ననుష్ఠించి సర్వసుఖంబులఁ బొందు మని యుపదేశింప నారాజవరుండు, ౩౦౯

ఆ॥ అరుసమొంది ధీర! ♦ యమునా సహస్రనా, మనుతిగూడఁ జెప్పి ♦ మనమువొంగఁ
జేయ వేఁడితి నన ♦ నాయోగి వర్యుండు, వలుకఁ దొడఁగె నిట్లు ♦ పార్థివేంద్ర!

వ॥ భూరమణా! యీమంత్రంబునకు సౌభరిమహర్షియు, యమునదేవతయు ననుష్టుప్ఛందంబును, మాయాబీజము కీలకంబును, రమాబీజంబు శక్తియుగలదు. ఈనామస్తోత్రంబుఁ బఠించుటకు ముందుగా "శ్యామామంభోజనేత్రాం" అను దానితో ధ్యానంబొనరించి "కాళింది" యను నామంబు మొదలు "సర్వతీర్థాధిదేవత" యను నామంబువఱకుంగల వేయినామంబులఁ సక్రమంబుగాఁ జదువనగు. ఇట్టి స్తోత్రం బొకమాఱు సల్పినవాని గృహంబునందుఁ జౌర్యంబును, రెండుసారులు జదివిన వాని కెట్టి ప్రదేశంబున నైనను జోరవ్యాఘ్రాదిభయంబులు గలుగనేరవు. శుద్ధద్వితీయయం దిద్దానిని బ్రారంభించి పూర్ణిమలోపలఁ బదితడవలు పఠించిన రోగి రోగంబునుండియు, బద్ధుఁడు బంధనంబునుండియు విముక్తు లగుదురు. గర్భిణి సుకుమారునిం గాంచు. విద్యార్థి సకలవిద్యలందుఁ గుశలియగు. మోహన స్తంభనోచ్చాటనఘాతనశోషణదీపనోన్మాదనతాపననిధిదర్శనవశీకరణంబులందు నేర్పును మనోగతంబులగు నిష్టంబులను సిద్ధింపఁ జేయు. దీనిని విధివిధానంబుగాఁ బారాయణం బొనరించిన బ్రాహ్మణుండు బ్రహ్మవర్చస్వియు, రాజన్యుండు సర్వరాజ్యాధిపతియు, వైశ్యుండు ధనాధిపతియు నగు. ఇది బ్రాహ్మణముఖంబుగాఁ దన్మహి

మంబు వినిన శూద్రుండును నిర్మలుండై మోక్షార్హుండగు. నిత్యంబును భగవత్పూజాకాలంబున నిద్ది చదివినవాఁ డుదకంబునం దరవిందంబు వొందియు నీరంటనట్లు సంసారమం దుండియుఁ దజ్జనితపాపంబు నంటఁడు. ఇది యొక సంవత్సరంబువఱకు నూరుమాఱులు ప్రత్యహంబుఁ జదివిన సప్తద్వీపవలయితంబగు నిమ్మేదిని నేకచ్ఛత్రాధిపతియై పరిపాలించుననుట కనుమానంబులేదు. నిష్కామియై యెవఁడిది చదువునో వాఁడు పురుషార్థంబులంబొంది జగతింబేరొంది జీవన్ముక్తుండగు. మఱియు నిది సావధానంబుగాఁ జదివినవా రఖిలసుఖంబులం గాంచి యంతిమంబున గోలోకంబున కరుగఁగలరని పలుక నా మాంధాత యాలించి యలరి మునికి నతులిడి నిజరాజధాని యగు నయోధ్యాపురంబున కేగెఁ గాదె! యింకను నీవేమి వినవలతువో తెలుపుమని యడుగ జనకుండు నారదున కిట్లనియె. ౩౧౧

తే॥ పుణ్యవశమున గోకులం ♦ బున జనించి, నట్టి సుదతుల గాథల ♦ నల్ల యర్క
పుత్రి పంచాంగమున్ వింటి ♦ భూసుర! మఱి, కృష్ణుఁడందేమి సేసెనో ♦ యెఱుఁగఁ జెపుమ!

## ప్రలంబాసుర వధ.

ఉ॥ నారదుఁ డద్ది వించు జన ♦ నాథున కిట్లనె నొక్కవేళలో
శ్రీరమణుండు భ్రాతయగు ♦ సీరిని గూడుచు గోసమూహముల్
బారులు గట్టి నేత్రయుగ ♦ పర్వముగాఁ జనఁ ద్రోలు చల్ల భాం
డీర వనంబుఁ జేరి యట ♦ కీవిగనుండెడి నొక్కచోటునన్. ౩౧౩

తే॥ గోవులను మేయఁ ద్రోలియుఁ ♦ గోడెకాండ్రఁ
గలసి వాహ్యావాహక రూప ♦ లలితకేళి
నాడుచుండెను కంసుచే ♦ నంపఁబడిన
యల ప్రలంబ నిశాచరుఁ ♦ డట్టితఱిని. ౩౧౪

ఉ॥ గోపకబాలకుం డగుచుఁ ♦ గుర్ధనలాలసులైన వారితో
శ్రీపతి చూచుచుండఁగనె ♦ చేరి ముదంబున నాడుచుండె నీ
రూపల గోపబాలకులె ♦ ఱుంగక పోయి రనంతరంబునం
దా పురుషోత్తముండు గని ♦ యందఱి కయ్యది దెల్పె నత్తఱిన్. ౩౧౫

ఆ॥ ఆటలందు గెల్చి ♦ నట్టి నీలాంబరు, నోడినట్టి కుఱ్ఱఁ ♦ డొకఁడు గూడఁ
బండెమేసికొన్న ♦ భంగి మోయఁగలేక, యుంటఁగను ప్రలంబుఁ ♦ డొప్పికదఱ.

ఉ॥ సీరిని స్వాంసలాంసమునఁ ♦ జేకొని పైనమొనర్చి యట్టి భాం
డీర వనంబు నుండియు వ ♦ డిన్ యమునాతటినీతటంబునన్
జేరిచి యందునుండి మఱేఁ ♦ జెల్వగు శ్రీమధురాపురంబునన్
జేరుట కుద్యమించు తఱి ♦ సీరి గనుంగొని యాతుణంబునన్. ౩౧౬

చ॥ ఘనసమమైన రూప మధి ♦ కంబుగఁ దాల్చి ధరాధరేంద్రు మా
డ్కిని బహుదుర్గముండయి త ♦ టిత్సహితాభ్ర గత ప్రపూర్ణచం
ద్రునివలె దైత్యపృష్ఠమునఁ ♦ దోఁచి వెలుంగఁ దొడంగె దీప్తి దీ
ప్తనవమణీ ప్రకాశిత సు ♦ వర్ణమయాభగణంబులన్ మఱిన్. ౩౧౮

ఉ॥ చండపరాక్రముం డయిన ♦ చక్రి సహోదరుఁ డాప్రలంబుఁ డు
ద్దండభయంకరుం డగుటఁ ♦ డాఁ గని వేగమ వానిఁ బట్టి యా
కొండలఁగొట్టు నింద్రువలె ♦ గ్రుద్ది శిరంబును జెండివైచె బ
ల్దండిగఁ బూలవాన విబు ♦ ధ ప్రతతుల్ గురియంగ భూవరా! ౩౧౯

ఉ॥ అంతట వాని జోతియును ♦ నా బలరామునిలో లయించె న
త్యంత జయధ్వనుల్ దివిని ♦ ధాత్రిని నిండె నరేంద్ర! యన్న భూ
కాంతుఁడు దిర్గి యిట్లు పలు ♦ కం దొడఁగెన్ మఱి వాని పూర్వ జ
న్మాంతర పుణ్యగాథను ద ♦ యామతి నాకు వచింపవే సుధీ! ౩౨౦

ప్రలంబాసుర పూర్వజన్మ వృత్తాంతము.

చ॥ సురముని తిర్గి యిట్లనె య ♦ శోధన! తొల్లిఁ గుబేరుఁ డిందు శే
ఖర పదపద్మపూజకు స్వ ♦ కంబగు చైత్రరథంబు నందునన్
విరులను రక్షసేయఁగఁ బ్ర ♦ వీణతఁ గాంచిన యక్షవర్యులన్
వఱలఁ నొనర్ప నాభటులు ♦ భద్రముగా గనుచుండి రింతలోన్. ౩౨౧

తే॥ ఒక్క దినమందు నేర్పరి ♦ హూహూ వనెడి, వానికొడుకును శ్రీహరి ♦ భక్తవర్యుఁ
డునగు విజయుఁడన్ గంధర్వ ♦ జనుఁడు హరిని, వేణువీణాగళంబులన్ ♦ వీధి వీధి.

ఉ॥ స్తోత్రముఁ జేయుచున్ ధనదు ♦ తోటను నెవ్వరెఱుంగ నట్లుగా
నాత్రముతోడఁ జొచ్చి విరు ♦ లన్నిటిఁ దిన్నగఁ గోసికొంచు నే
మాత్రపు సద్దులేని యటు ♦ మంచివడిన్ జనె నంతదాని నా
చైత్రరథేశ్వరుండు గని ♦ చాల విచారముఁబొంది కిన్కతోన్. ౩౨౩

చ॥ అరరె! యిటుల్ మదీయ వన ♦ మందునఁ జేరి సుమంబు లన్నిటిన్
బొరిఁ బొరిఁ గోసి కైకొనుచుఁ ♦ బోయె నెటో యల తెక్కరీఁడు త
న్నర సుర యక్ష కిన్నర గ ♦ ణస్థితుఁడైన ఘనుండునైన ను
ద్ధురమగు నాదు శాపమునఁ ♦ దోడ్తనె రక్కసుఁ డౌచుఁ బుట్టుతన్. ౩౨౪

చ॥ అని శపియించెఁ దద్విధిని ♦ నా విజయుండు నిశాట రూపమున్
దనకు ఘటిల్లుచుండుట న ♦ దాటునఁ గాంచి యకృత్యమెంచి తో
డ్తనె యల గుహ్యకేశ్వరుని ♦ దాపునకుం జని తత్పదంబులన్
వినయ విధేయతల్ గలిగి ♦ వేమఱు మ్రొక్కి నుతించి యిట్లనెన్. ౩౨౫

తే॥ తప్పుఁ బొరపాటుచే నిప్డు ♦ తావకోప, వనము నందునఁ జేసితి ♦ ధనద! నేను
రాక్షసాకృతితో ధరన్ ♦ బ్రతుకఁజాలఁ, గాన మన్నించి ప్రోవుమ ♦ కరుణతోడ

తే॥ అనఁగ నా నరవాహనుఁ ♦ డభిమతించి, ద్వాపరాంతము నందున ♦ వాసుదేవు
నన్నయౌ బల భద్రుని ♦ హస్తములను, శాపముక్తుఁడ వగుదువో ♦ సరసహృదయ!

తే॥ అనుచుఁ గరుణించెఁ దత్సూక్తి ♦ నా విజయుఁడు,
దైత్యుఁడై ప్రలంబాఖ్యతోఁ ♦ ధరణిఁబుట్టి
యచ్యుతాగ్రజ హస్త సం ♦ హతుల శాప
ముక్తుఁడై పరమొందె నో ♦ పుణ్యపురుష! ౩౩౧

కృష్ణుండు దావాగ్నిని మ్రింగి గోపకులను రక్షించుట.

తే॥ పిదపఁ గేళీలాలసులగు♦పిల్లవాండ్రు, ఘాస లోభంబునన్ ముంజ♦కాననమున
కరిగి మేసెడి నాత్మీయ ♦ సురభి తతుల, ద్రోలుకొని రాఁగఁ దేకువ ♦ తోడఁ నేగి.

సీ॥ మన్మథ దేవుని ♦ మన్ననఁ గల్పు ము, క్కంటిదౌ మూఁడవ ♦ కన్ననంగ
భగ్గుభగ్గునమండి ♦ యెగ్గుల మిక్కిలి, కలిగించెడి బడబా ♦ నల మనంగ
సంభోధిమంధన ♦ మందు నొక్కుమ్మడి, బైలు దేరిన విష ♦ జ్వాల లనఁగ
సర్వలోకంబుల ♦ క్షణములోన దహించు, ప్రలయ కాలాభీల ♦ వహ్ని యనఁగ

తే॥ ఘోర భీకర మైనట్టి ♦ కారుచిచ్చు, పుట్టి తన్మహారణ్యంబుఁ ♦ జుట్టుముట్టి
కాల్చుచుండుటఁ గనుఁగొని♦కాతరులయి, యేమితోఁచక యెలుగెత్తి♦యిటుల ననిరి.

మ॥ అదిగో దావము చిట్పటార్భటులతో ♦ నంతంతకున్ మమ్ములన్
గదియన్ సాగె ధృతోరుకౌస్తుభమణీ! ♦ క్ష్మారాజచూడామణీ!
త్రిదివేశేశ్వరరక్షణప్రియమణీ! ♦ దీనాళి చింతామణీ!
స్వదయార్ద్రాఘభుజంగగారుడమణీ! ♦ చక్రాదిపాణీ! గుణీ! ౩౩౧

తే॥ కృష్ణ! కృష్ణ! కృపాకరా!♦కీర్తనీయ! మమ్ము దావాగ్ని కసితోడ♦మంటఁ గలుప
వచ్చెడిని నిన్నుశరణంబుఁ♦జొచ్చుచుంటి, మయ్య! చయ్యన రక్షింపు♦మియ్యదనుకన.

చ॥ అనఁ గరుణాళువుం డయిన ♦ యచ్యుతుఁ డిట్లనె నన్నలార! మీ
మనముల భీతి వీడి యొక ♦ మాఱు కనుంగవ మూయుఁడీ! యన
న్వని యల గోపబాలురు స్వ♦ నేత్ర యుగంబును మూసి రంత నా
వనజదళాయతేక్షణుఁడు ♦ వహ్ని దహించెడి చోటు జేరుచున్. 333

చ॥ జలమును గ్రోలు పోలికను ♦ సాదపు ముద్దను మ్రింగు భంగిగా
వలయముగా దహించెడి ద ♦ వంబు గుటుక్కున మ్రింగె నింగి వే
ల్పులు దమ వ్రేళ్ల నాసికల ♦ మోపి విచిత్రముఁ బొందుచుండ మి
త్రులు నులు కాత్మలన్ విడిచి ♦ తోషముఁబొంద బలుండు మెచ్చఁగాన్. 33౪

మ॥ తరువాత న్మునివర్యుఁడైన హరి యా ॥ దానంబుఁ బోకార్చి త
త్సురభివ్యూహకగోపబాలకులతో ॥ సూర్యాత్మజాతీరభా
సురభాండీరమహావనస్థపృథులా ॥ శోకాటవిం జేరి సం
బరమొందెన్ జనకా! మహాత్ములకు నే ॥ భావంబు సిద్ధింపదే?　　33౫

ఉ॥ అంతన గోపబాలకులు ॥ నాఁకట దప్పిచి బీడఁ బొంది బ
ల్డింది బలాన్వితాచ్యుతుని ॥ లెస్సగ వందనముల్ బొనర్చి తా
రందరు జేరి వేడి రిటు ॥ లక్కట! దూపను క్షుత్తుచే వ్యథల్
జెంది నశింపనుంటి మిఁకఁ ॥ జెచ్చెరఁ బ్రోవుము! నందనందనా!　　33౬

తే॥ అంత సోకుమూశిలగొంగ ॥ యందుల కురు, రీకరించియు వారికి ॥ రీతిఁ బల్కె
మాధురులగు బాపలతోడ॥మఖము నంగి, రసుఁ డొనర్చెడి సీచెంత॥రయముతోడ,

ఉ॥ అచ్చటి కేగి బ్రాహ్మణుల ॥ కందఱకున్ గిడిగిళ్ళు భక్తితోఁ
గ్రచ్చఱ సల్పి యన్న ముద ॥ కంబుల నడ్గుడు పొండనంగ వా
రచ్చట నుండి పైనమయి ॥ యా మునివర్యుని యజ్ఞవాటికన్
జొచ్చి విధేయులై మిగుల ॥ జోత లొనర్చి వచించి రిట్టులన్.　　33౮

ఆ॥ విప్రవర్యులార! ॥ యప్రమేయుండగు, గోకులేశసుతుఁడు ॥ గోపబాల
కులను గూడి గోత ॥ తులఁ దమిఁ ద్రోలు చ, శోకమనెడి వనికి ॥ సారిది వచ్చె

క॥ ఆతఁడు నాతని భ్రాతయు, నాతనితోఁ దిరుగు ॥ లాడెడి మిత్ర
వ్రాతము లన్నోదకముల, నాతురులై రందువలన ॥ నవి మీరిడుఁడీ!　　3౪౦

ఉ॥ వారల కుయ్యిన్ విని స ॥ వక్రియలన్ నెరవేర్చు భూసురుల్
వారికి నిట్లు వాకొనిరి ॥ బాలకులార! ముదంబుతో నిటన్
వారిని గాని యోదనము ॥ పట్టెడుగాని యొసంగు వీలు మా
కేరహిఁ గల్గలేదని వ ॥ చింపఁగఁ జింతిలుచుంటి మక్కటా!　　3౪౧

శా॥ అంతన్ వారు నిరాశులై యల సరో ॥ జాక్షున్ మఱల్ జేరుచున్
జింతాక్రాంతమనస్కులై యనిరిటుల్ ॥ శ్రీకృష్ణ! నీ యానతి
న్నింతాకంతయు దాఁటకుండ మఖమున్ ॥ నేమంబుతోఁ జేయు వే
దాంతార్థప్రథితాగ్రజన్ములను మే ॥ మర్థింప నన్నాంబువుల్.　　3౪౨

క॥ ఏమియు లేవని వాకొని, రామీఁదట మీదు దరికి ॥ నరుదెంచితి మిం
కేమెటు బ్రతుకంగలమో, యీ మెయి నుడువంగవలయుఁ॥దృష్ణన్ గృష్ణా!

క॥ నావుడు వారికి నిట్లనె, శ్రీవిభుఁడో బాలులార! ॥ చెచ్చెర నలభూ
దేవుల భార్యల చెంతకు, నీవేళనె పోయి యడిగి ॥ యిచ్చులఁ గనుఁడీ!　　3౪౪

క॥ ఈతడవకు నామాటను, బ్రీతిగ విని పొండనంగఁ ॥ బిల్లలు మఱి యు
త్పాతోన్మూలనపటుసవ, మాతతముగఁ జేయు నిక్క ॥ కరిగియు నందున్.

చ॥ చెలఁగెడి ధాత్రిదేవతల ♦ చెల్వల మ్రొక్కుచు నమ్మలార ! గో
కులపతిపుత్రకుండు నవ ♦ కోటిసుధాకరసుందరాస్యుఁడుఁ
జలదనిభుండు పుష్పశర ♦ సామ్యమనోహరవిగ్రహుండు సా
జలజదళాయతాక్షుఁడు వ్ర ♦ జస్థలినుండి వయస్యయుక్తుఁడై. ౩౮౬

ఉ॥ గోవులఁ ద్రోలుకొంచు ఖగ ♦ గుల్మలతాపరిపూర్ణమౌ యశో
దావనిజాభిరామవని ♦ కాగతుఁడయ్యెను నందునున్న మి
త్రావళితోడ క్షుత్తృషల ♦ నక్కలిఁ బొందెడి దాన మీరు మా
కేవిధినేఁ జలాన్నముల ♦ నిండిఁకఁ ద్రోయకుఁ డస్మదుక్తులన్. ౩౮౭

మ॥ అని వేఁడన్ ధరణీసురాంగనలు దా ♦ మాలించి యాకుఱ్ఱలన్
గని యోబాలకులార ! మీరిపుడిటన్ ♦ గాంఢించు నన్నాంబువుల్
గొనుఁడీ ! యట్టి మహామహుం గనుటకై ♦ కోర్కుల్ ఫలింపంగ మే
మును రానెంచితి మంచు వారి కిడి ర ♦ ప్పాంబువ్వ లవ్వారిగాన్. ౩౮౮

చ॥ పదపడి బాలకుల్ సనిరి ♦ బ్రాహ్మణభార్యలు బైలుదేరి స
మ్మదమునఁ దన్మహాటవిని ♦ మన్మథమన్మథు సాగ్రజన్ముఁ గృ
ష్ణుఁ దనివి తీఱ విన్నవిధిఁ ♦ జూచితిమం చరుసంబుఁ బొంది త
త్పదములకున్ నమస్కృతుల ♦ భక్తిని బల్మఱొసర్చియుండుడున్. ౩౮౯

తే॥ తమ్మికంటియుఁ గన్గొని ♦ తన్వులార!, మీర లిటకు నేతెంచుటల్ ♦ మేలుసుమ్మి
వల్లభులతోడఁగూడి ప్రాం♦పంచిక సుఖ,ములను జెంది గోలోకంబుఁ♦బొందఁగలరు

క॥ అని వరమిడ నతులిడి వా,రు నశోకవనమ్మునుండి ♦ త్రుటిలో నాత్మీ
యనిలయములకుఁ జనుదెం, చినఁ గని తత్ప్రియులు నెదలఁ ♦ జింతిలి రిట్టుల్.

తే॥ సరసిజాక్షునిఁ గనిన మా♦తరుణిమణుల,జన్మములె సార్థకంబులు♦సత్య మల్ల
కంసభయమున శౌరినిన్♦గనని మాదు, జన్మ మేటికిఁ గాల్పనే♦జగతియందు.

ఉ॥ పిమ్మట నందనందనుఁడు ♦ పిల్లలు దెచ్చి యొసంగు నన్నతో
యమ్ముల మిత్రసోదరస ♦ మన్వితుఁడై భుజియించి గోసమూ
హమ్ములఁ ద్రోలుకొంచు హృద ♦ యంగమమౌ నల బృందకాటవిన్
శమ్ముగఁ జేర నో యుపని ♦ షద్విపులార్థవిదగ్రణీ! గుణీ ! ౩౯౩

శ్రీకృష్ణుండు గోపకులకు వైకుంఠలోకంబు జూపుట.

తే॥ పాపహరమగు మఱి యొండు ♦ శ్రీపతికథఁ
జెప్పుచుంటిని విను మార్య ! ♦ శ్రీకరంబు
నఘహరంబును బరమంబు ♦ నఖిల శుభద
మైన యేకాదశీవ్రత ♦ మాస్థతోడ. ౩౯౪

ఉ॥ గోకులనాథుఁ డొక్కతఱిఁ । గోర్కి ఫలింపఁగఁ జేసి ద్వాదశిన్
వేకువ లేచి గోపపరి । వేష్టితుఁడై యమునా ధునీమణిన్
వీఁకను జొచ్చి క్రుంకు లిడ । వేళను నప్పతి సేవకుండు త
ద్గోకులనాథు రజ్జువుల । తో బిగగట్టి మహాజవంబునన్.                    ౩౫౬

తే॥ వరుణలోకంబునకుఁ గొనిపోవ నపుడు, గోపకులను గోలాహల । మాపఁజాల
నట్టు లయ్యెను బిమ్మట । నచ్యుతుండు, వారి నూరార్చి ముట్టె యా । వరుణపురిని.

చ॥ పరువముతోడ మదేభముల । వాజులఁ దేరులఁ గేతనంబులన్
బరిఖల దుర్గవప్రములఁ । బత్తుల భర్మమయోరుహర్మ్యముల్
బొరిఁబొరి బూదిలోఁ గలిపి । మూలను డాఁగిన పాళిఁబట్టగా
నరిగెడి వేళ నా వరుణుఁ । డంజలులన్ ఘటియించి యిట్లనెన్.              ౩౫౭

ఉ॥ కోపము మానుమయ్య ! యను । కూలపథంబున నుండుమయ్య ! మా
యోపినయంత మీ యెడ న । నుత్తమరీతి వసింతుమయ్య ! మే
మీపరిఁ జేయు తప్పులను । నెంతయు నీవు క్షమింపుమయ్య ! యో
శ్రీపతి ! నీ పదంబులకు । శీర్షముతో నతులం బొనర్చెదన్.                 ౩౫౮

క॥ గోపీదుకూలచోరా !, గోపీకేళీవిలోల ! । గోపీనాథా !
గోపకరాజకుమారక !, గోపకవంశాబ్ధిచంద్ర ! । గోపాలమణీ !                ౩౫౯

మత్తకోకిల॥ శిష్టరక్షక ! దుష్టశిక్షక ! । చిత్రఖేలనలోలుపా !
యష్టదారమనోహరా ! పృథు । లాదితేయగణప్రియా !
యష్టమూర్తినుతప్రభావ ! య । హస్కరార్బుదతుల్య ! మా
కష్టముల్ దొలఁగంగఁ జల్లగఁ । గావుమా ! కమలేశ్వరా !                    ౩౬౦

శా॥ బ్రహ్మాండేశ్వరు బ్రహ్మనాభు ననఘున్ । మందారు మందారునిన్
బ్రాహ్మణ్యాంఘ్రిసరోజరాజివినతి । ప్రారంభ ధన్యాత్మునిన్
బ్రహ్మానందమయున్ నిరామయుని శ్రీ । రాధామనోచోరుఁ ద
ద్బ్రహ్మానిర్వచనీయుఁ గృష్ణుని నినున్ । బ్రార్థింతు విశ్వంభరా !            ౩౬౧

చ॥ అని పొగడంగఁ జక్రధరుఁ । డాగ్రహమున్ విడి సుప్రసన్నుఁడై
మనమున భీతి మానుము సు । మాళముగా మను మోయి పాళి ! యీ
పనులిఁకఁ జేయకుండుమని । పల్కుచు నందుని త్రాళ్ళు విప్పి తో
డ్కొని యమునాతటిన్ వెలుఁగు । గోపకసన్నిధిఁ జేర్చె నంతటన్.            ౩౬౨

ఉ॥ నందముఖంబునన్ వనజ । నాభు ప్రభావము గోపకుల్ మహా
నందము గల్గఁగా వినియు । నమ్మఁగఁజాలక నందనందనున్
డొందరతోడ డాయుచు మ । ధుసనవుక్తులఁ బల్కి రిట్లు గో
విందపదారవిందయుగ । వేష్టన జృంభితబంభరోపమా !                    ౩౬౩

తే॥ నీరజాతాయతేక్షణా! నిశ్చయముగ, నీవు భగవంతుఁడవే? యైన నీకుఁ డెంకి
యైన వైకుంఠలోకంబు నఱమరలను, విడిచి చూపింప వినుతిఁ గావింతు మిపుడు.

క॥ అంత ననంతశయానుఁడు, సంతసముం గని సగోప జనుఁడై వైకుం
ఠాంతరదేశంబున క,త్యంతంబగు శీఘ్రగతిని నరిగియు నటఁ దాఁ. ౩౬౭

సీ॥ వేయి శిరఁబులు వేయి పాదంబులు, వేయి భుజఁబులు వెలుఁగుచుండ
శంఖఁబుఁ జక్రంబు శార్ఙ్గంబు గదయును, బద్మంబు వనమాల పరిఢవిల్ల
చామరాందోళికా చ్ఛత్రకిరీటకే,యూరాది భూషలు నొప్పుచుండ
సవ్వడిలేనట్లు జక్కఁగాఁ గావించు, పార్షదుల్ పెక్కురు వరగుచుండ

తే॥ పెక్కుసూర్యుల కాంతులు పెరుఁగుచుండ
సురవరాదులు మ్రొక్కి సం స్తుతులు సల్ప
జ్యోతిరురుమండలంబున నొప్పు సింహ
పీఠమున నున్న శేషుపై వెలిఁగె నపుడు. ౩౬౮

తే॥ గోకులమునుండి వచ్చిన గోపకులతి, భయమునఁ గుసగుసలాడి వఱలుచుంటఁ
గాంచి పార్షదులెల్లరు కసలి దవ్వు, నందు వారిని గూర్చుండ నాజ్ఞచేసి.

ఉ॥ ఎత్తఱినైన విష్ణుసభ నీరలు గాంచితిరొక్కొ? యిట్టులు
న్మత్తుల పోల్కి వాగుటలు నాయమె? యీ యెడ నాల్గువేదముల్
మొత్తముగాఁ బరేశ్వరుని ముచ్చట సెప్ప వెలుంగరొక్కొ? నో
శ్చైత్తిక యింక భక్తి నల కృష్ణుని గొల్వుఁడి! ముక్తిఁ బొందుఁడీ! ౩౬౯

తే॥ అని వచింపఁగ గోపకుల్ హర్షమొంది
మానమును బూని తమ తమ మానసముల
కిట్లు బోధించుకొని రీర మేశ్వరుండు
దివ్యసింహాసనంబునఁ దేజరిల్లి. ౩౭౦

చ॥ మనల నధఃకరించి యొక మాటయునే న్మనతోడఁ బల్కఁ డం
దున శతధా వ్రజస్థలమె తుష్టికరంబు సుఖప్రదంబు గా
వున సిట లేచి యచ్చటికిఁ బోవఁగ నౌనని యెంచు వారిఁ దో
డ్కొని వడితో రమేశ్వరుఁడు గోకులమేగె ననంతరంబునన్. ౩౭౧

## సుదర్శనోపాఖ్యానము.

సీ॥ మఱియొక వేళను మణిగణాన్నాన్వితి, శకటముల్ గొంచు గో పకనికరము
నవనందవరులుప నందులు మద్వృష,భానువులుఁ దమ వసతినుండి
నక్షిపర్వంబైన యంబికావనమున, కరిగి సభృత్యులై యందు విడిసి
యందు మహావిద్య యను పేరఁ బరగెడి, భద్రకాళీదేవిఁ బార్వతిను

తే॥ భక్తితోడుతఁ బూజించి ♦ పాపతాప
హరమగు శ్రీసరస్వతీ ♦ ప్రాదినీత
టమున భూదేవతలకు దా ♦ నముల నొసఁగి
మ్రొక్కి మృష్టాన్నము భుజించి ♦ ముచ్చటాడి. ౩౭౧

క॥ అందంబగు నొకచోటున, నందఱు నివురించి రంత ♦ నజగర మొండా
నందుని పాదము గఱవఁగ, నందుఁ డులికిపడుచు లేచి ♦ నలఁగుచు పడుచున్.

ఆ॥ పాహి! పాహి! కృష్ణ! ♦ పంకజలోచనా!
యేదొ కఱచె నన్ను ♦ నీవు గనుమ!
యంచు నెలుఁగునెత్తి ♦ యార్వ నిద్రించిన
వారు లేచి యటకుఁ ♦ బాఱి చేరి. ౩౭౩

క॥ కఱచెడి నురగముఁ గనుఁగొని, కొఱకొఱలాడుచును గఱ్ఱఁ ♦ గొట్టినఁగానీ
శిరమునఁగలమణి వీడని, తెఱఁగున నది యడుఁగు విడక ♦ తిరుగుచు నుండెన్.

క॥ అత్తఱిఁ గాళియమర్దనుఁ, డత్తెఱఁగును గాంచి కసి ని ♦ జాంఘ్రిని దన్నన్
దత్తఱిలి యది తదాకృతి, బొత్తుగ విడి పొంది పూర్వ♦పుణ్యాకృతినిన్. ౩౭౪

వ॥ శ్రీహరినిం జేరి సాష్టాంగప్రణామంబు లాచరించి ముకుళిత కరార విందుండై స్వామీ! భక్తవత్సలా! యేను సుదర్శనుం డను పేరంబరగు విద్యాధరుండను. ఒక్కసమయంబున నష్టావక్రమహామునీశ్వరుం గాంచి పరిహసించితిని. దాన నామహామహుండు కనలి సర్పంబు గమ్మని నాకు శాపం బిడె, అక్కతన నిందనుకఁ దద్భోగిరూపంబున నుండి పతితపావనేత్యాదిబిరుదాంచితభవత్పద పద్మమకరందరజఃకణస్పర్శనంబునఁ దచ్ఛాపంబు సమాప్తంబై తొల్లింటి రూపు నాకుఁ జేకూఱ ధన్యుండ నైతింగాదె? ఇట్టి లోకశంకరుండవగు నిన్ను సన్నుతింప సమర్థుండనే? మన్నించి నన్ను రక్షింపు మని ప్రార్థించి సర్వోపద్రవరహితంబగు వైకుంఠలోకంబున కేగె. అంత నందులకా నందాదిగోపకు లంద అధికాశ్చర్యానందంబులం బొంది యాతండు భగవంతుండే యని నిశ్చయించి పొగడుచు మరలి వ్రజమండలంబున కేతెంచిరి. ౩౭౬

తే॥ వెండి యీ వేమి వినెదవో ♦ వేగఁజెపుమ,యనఁగ జనకుండు మోదిల్లి ♦ యా వ్రజమున
వనరుహాక్షుఁ డేలీలల ♦ నొనరిచెనో కో? తెలుపుమా! యనన్ మునిమణి ♦ వలికె నిట్లు.

తే॥ పసిఁడిపుట్టముతాల్పొక్క ♦ పట్టునంద, నన్నతోఁగూడి స్వీయగృ ♦ హంబునుండి
వెడలి యచలభాగములందుఁ ♦ బిల్లవాండ్రఁ,గూడి డాఁగురుమూఁత ♦ లాడఁదొడఁగె

## శ్రీకృష్ణుండు వ్యోమారిష్టాసురులను వధించుట.

తే॥ అట్టిపట్టున దిట్ట మ ♦ యాత్మజుండు, బలియు నగు వ్యోమదైత్యుండు ♦ బైలుదేరి
గోపరూపంబు దాల్చి త ♦ త్కుర్దనరతు, లైన గోపకబాలుర ♦ నపహరించి.

తే॥ కొండబండల క్రిందుఁగాఁ ♦ జండగతిని, సారెసారెకు వచ్చుచుఁ ♦ జనుచు నున్న
తాద్రిసానువులందున ♦ భద్రపఱచు, చుంట సోకుమూకలగొంగ ♦ యొయ్యఁజూచి.

ఉ॥ రక్కసునిం గరంబులఁ గ ♦ రంబుగఁ బట్టి ధరాస్థలంబుపై
నుక్కున నొక్కపెట్టున జ ♦ యోక్తులు నిండఁగఁ బుష్పవర్షముల్
జక్కఁగ దేవత ల్గురియ ♦ సంగడికాండ్రును మెచ్చ నవ్వల
మ్మక్క! యనంగఁ గొట్ట నతఁ ♦ డానిముసంబున నీల్గె భూవరా! ౩౮౧

ఆ॥ అంత వాని జోతి ♦ యఖిలదిక్కులయందు, వెలిఁగి చక్రిలోన ♦ విలయమొందె
ననఁగ జనకుఁడో మ ♦ హర్షి! తత్ప్రిక్తన, జన్మచరిత మెఱుఁగ ♦ స్పష్టపఱచు.

క॥ నావుడు ముని యనె నాతఁడు, భూవర! భీమరథనామ ♦ భూషితుఁడన్ మే
ధావియు, యజ్వాయు, ధని బలి, శ్రీవిభు భక్తుండు నగుచుఁ ♦ జెలఁగెను గాశిన్.

ఉ॥ ఆతఁడు రాజ్యపాలనము ♦ నందఱు నౌనని మెచ్చఁ జేసి ని
ర్భీతిని బట్టభద్రునిగఁ ♦ బ్రెగ్గడయైన కుమారు నిల్పి ప్ర
ఖ్యాతత దివ్యమైన మల ♦ యాద్రికి నేగియు లక్షవర్షముల్
బ్రాఁతిగ నిల్పి శ్రీధరుఁ ద ♦ పం బొనరించెను తత్త్రాణంబునన్. ౩౮౪

తే॥ మునివరుఁడగు పులస్త్యుఁడు ♦ ముచ్చటపడి, ఛాత్రబృందంబుతోఁగూడి ♦ చనఁగనట్టి
భీమరథరాజు లేవక ♦ వినతులిడక, గర్వియై యుంటఁ గనుఁగొని ♦ కరము గనలి,

క॥ దనుజుఁడవగుమని శాపం,బు నొసంగెను నంత నట్టి ♦ భూమీధవుఁడా
మునిపదములపైఁ బడి శరణును జెందఁ బులస్త్యముని క ♦ నుంగొని దయతోన్.

తే॥ ద్వాపరాంతమునందున ♦ వ్రజములోనఁ, జక్రి యుదయించుఁ దద్భుజ ♦ శక్తిచేత
శాపముక్తుఁడవై నీవు ♦ శౌరియందు, లీనమయ్యెద వో సుధీ ♦ మాననీయ!

తే॥ అని వచించెను బిమ్మట ♦ నాతఁ డల్లె, మయనిశాచరపుత్రుఁడై ♦ మహినిబుట్టి
వ్రజమునందున శ్రీహరి ♦ బాహుశక్తి,చేత గిట్టి పరేశ్వరున్ ♦ జేరె జనక!

ఉ॥ వెండియు నిల్లె యొక్కతఱి ♦ విశ్వభయంకరుఁ డాయతాంగుఁడున్
జండపరాక్రముండు దను ♦ జప్రముఖుం డతికుత్సితుం డరి
ష్టుండనువాఁడు గోపకశి ♦ శుప్రకరంబునఁ జేరి రోదసిన్
నిండి ప్రతిధ్వనింపఁగ న ♦ నేకవిధంబుల బొబ్బరించుచున్. ౩౮౯

తే॥ శృంగములతోడ గిరుల మ ♦ హీస్థలమునఁ, గూల్చి తరువుల నన్నిటిన్ ♦ గోడుపఱచు
చుంట గో గోపగోపిక ♦ లోర్వలేక, భయమునన్ గాల్కలందిగఁ ♦ బాఱి రవల.

చ॥ సభయుల నాత్మమిత్రులను ♦ శౌరి కనుంగొని భీతి వీడుఁ డం
చభయ మొసంగి యట్టి వృష ♦ భాకృతినుండిన దైత్యుఁ ద్రోయ వాఁ
డు భళి యనంగ మాధవుఁ బ ♦ టుత్వమునం గొని దచ్చికోసులన్
రభసముతో ధరన్ బడఁ గ ♦ రంబుగ నెట్టెను కృష్ణుఁ డంతటన్. ౩౯౧

ఉ॥ బాలుఁడు చెంబు బండపయి ♦ బ్రద్దలుగాఁ బడవైచినట్లుగా
లీలఁగ వాని వాలము ల ♦ లిం గొని గిఱ్ఱునఁ ద్రిప్పి త్రిప్పి యా
నేలను గొట్టె నంత నల ♦ నిర్జరవైరియు లేచి యొక్కపెన్
శైలముఁ గొమ్ములన్ బెఱికి ♦ చక్రిశిరంబున వేసె నార్పుచున్. ౩౯౨

ఉ॥ అయ్యది కాంచి కిన్క మరు ♦ నయ్యయు నయ్యచలంబు నయ్యెడ
న్జయ్యనఁ గొంచు నయ్యసుర ♦ నాథు తలన్ బడవైచె దానిచే
నయ్యసురుండు కొంతవడి ♦ వ్యాకులుఁడై మఱిలేచి కొమ్ములన్
గయ్యము గోరి యుర్వి నుచ ♦ కంబు జనించెడిలాగు గ్రుమ్మచున్. ౩౯౩

చ॥ కమలదళాక్షుపై నుఱికఁ ♦ గాఁ గని చక్రి తదీయదీర్ఘశృం
గములను బట్టి వాతహతిఁ ♦ గంజము తిర్గిన యట్లు త్రిప్పి రో
షమున ధరిత్రిఁ గొట్టఁగ ని ♦ శాటుఁడు రక్కసి రూపువీడి భూ
మ్యమరశరీర మూని యుల ♦ యంబుజనాభుని మ్రొక్కి యిట్లనెన్. ౩౯౪

సీ॥ నీరమణీయాంఘ్రి ♦ నీరజంబునఁ గదా, తుంగవీచీ సంగ ♦ గంగ వొంగె
నీమనోహరనాభి ♦ నీరజజనిఁ గదా, పృథుమాయ బిడ్డలఁ ♦ బెట్టియుంట
నీ కమనీయాస్య ♦ నీరజంబునఁ గదా, భూసురవర్యులు ♦ బుట్టియుంట
నీదివ్యలోచన ♦ నీరజంబులఁ గదా, నీరజమిత్రుండు ♦ నెగడియుంట

తే॥ నీమనంబునఁ గద చంద్రుఁ ♦ డామతిలుట,నీదు సంకల్పమునఁ గదా ♦ నిఖలభువన
ములును బుట్టుట గిట్టుట ♦ యలరియుంట, పాశుపాల్యప్రవీణ! గో ♦ పాలబాల!

మ॥ కరుణాంభోనిధి! నందపుత్ర! నిజ భ ♦ క్తశ్రేణికల్పద్రుమా!
వరతంత్వాఖ్యుఁడ బ్రహ్మచారిని సురో ♦ పాధ్యాయశిష్యుండ భూ
సురుఁడన్ నేఁ బొరపాటుచే గురుదరిన్ ♦ జొచ్చిల్లి పాదంబులన్
గరమున్ జాపి తిరస్కరింప గురుఁడున్ ♦ గాఠిన్యభావంబునన్. ౩౯౬

తే॥ ఎద్దువగుమని నను శపి ♦ యించెఁగృష్ణ!, దాన వంగదేశములందు ♦ నేను వృషభ
రూపమును దాల్చితి సురవి ♦ రోధిమైత్రి, వలన రాక్షసత్వంబును ♦ గలిగె నాకు.

తే॥ నీయనుగ్రహంబున నేను ♦ నేఁడు వేడ్క, శాపముక్తుండనైతి రా ♦ క్షసత విడిచి
యుంటి నీ రేడుజగముల ♦ కొడయుఁడవగు, నీకు మ్రొక్కెద శ్రీకృష్ణ! ♦ నిర్మలాత్మ!

తే॥ అనుచు మ్రొక్కి విమానంబు ♦ నందు నెక్కి, దివ్య తేజంబుతో వాఁడు ♦ దివముఁ జేరె
నిపుడు పాపహరంబు న ♦ భీష్టదంబు, నైన మాధుర్యఖండంబు ♦ నంటి జనక!

ఉ॥ ఆపదధీనదీనకరు ♦ ణార్ద్రకటాక్ష! విపక్షశిక్షకా!
గోపరిపాలనప్రియ! య ♦ ఘోరసుదర్శనచక్రపాణి! ల
క్ష్మీపతి! శౌర్య ధైర్యబల ♦ శేవధి! ధీనిధి! యాదవాన్వయో
ద్దీపక! సూర్యకోటిసమ ♦ దీప్తివిభాసుర! భూమనోహరా! ౪౦౦

ఉత్సాహ॥ నిత్యసత్య శుద్ధబుద్ధ • నిర్వికల్ప చిన్మయా!
స్తుత్య వేదరాశిగమ్య • దోషదూర! శ్రీకరా!
ప్రత్యయార్థ! విశ్వరూప! • పద్మనాభ! కేవలా!
ప్రత్యనీకభీకరాంగ! • బహుళ లోకనాయకా! ౪౧౧

గద్యము:- ఇది శ్రీమత్పరమపవిత్రాపస్తంబసూత్ర, భారద్వాజసగోత్ర, చివుకుల
కులజలధికళానిధి, కోటమాంబాకామయ తనయ, లక్ష్మీదేవీ
సుబ్రహ్మణ్య దత్తపుత్ర, శ్రీకృష్ణప్రసాదాసాదిత కవిత్వ
నిశ్చయ, సుజనవిధేయ, శ్రీనివాసాపరనామధే
యాప్పయశాస్త్రిచే నాంధ్రీకృతంబైన
శ్రీగర్గభాగవతం బందలి
మాధుర్యఖండము
సంపూర్ణము.



శ్రీ శ్రీ శ్రీ
హరిః ఓంతత్సత్
శ్రీకృష్ణార్పణమస్తు.



శ్రీ కృష్ణపరబ్రహ్మణే నమః

# శ్రీ గర్గ భాగవతము.



## మధురాఖండము.





మధురానాథా! శ్రీధర!
మధుదైత్యవినాశకృతిస • మర్థా! లక్ష్మీ
మధురాధరపానప్రియ!
ప్రథనాధిక విక్రమాఢ్య! • రాధాకృష్ణా! ౧

వ॥ అనవుడు జనకుం డమరమునీంద్రుని కిట్లనియె, మునివరా! రాధామాధవ కథావిధానకథనప్రథితసుధీనిధివగు నీ వనుగ్రహించి సకలజనమనోభిరామంబగు నమ్మధురాపురవరంబున నా మధురిపుం డేయే కార్యంబు లెట్లెట్లొనరించెనో దుర్భరంబగు దోర్బలంబున నిక్కన మార్తుర నొక్కమ్మడిం ద్రొక్కం జాలిన యక్కడీఁడగు నక్కంసుని ధ్వంసం బెట్లు గావించెనో విశదీకరింపు మని ప్రార్థింప నా కయ్యపుఁ దిండి యయ్యవనీంద్రున కిట్లనియె. ౨

కంసుండు శ్రీకృష్ణ వధార్థంబై పన్నాగంబులఁ బన్నుట.

క॥ ఒకతఱి మధురానగరికి, నికపాత్మజ విపులవంశ • నిధనోద్యమమున్
ద్రికరణశుద్ధిగఁ గోరి కు,తుకమున నే నరిగి యుంటి • దోషవిదూరా! 3

చ॥ చనిచని కాంచితిన్ మనుజ • చారణ కిన్నర సిద్ధ యక్ష రా
డ్దనుజ సురాప్సరోజనయు • తంబు శతాంగమదేభ వాజిరా
జినిభృతమున్ బలిష్ఠ యదు • శేఖరయుక్తము నూత్నరత్నజా
తినివృత వేదికాన్వితము • దివ్యము కంససభాప్రదేశమున్. ౪

ఉ॥ అందున నల్గడల్ జయజ ♦ యధ్వను లొప్పఁగ సింహపీఠికన్
జెందిన దుష్టుఁ గంసు యదు ♦ శేఖరుఁ గాంచితి నంత నాతఁ డా
నందముతోడ భండనము ♦ నన్ మును పింద్రునినుండి గొన్న యా
సుందరచామరాది పరి ♦ శోభితపీఠ మొసంగి భక్తితోన్. ౫

ఉ॥ నాకు సమర్చఁ జేయఁగ ఘ ♦ నంబుగ నుబ్బి యిటు ల్వచించితిన్
భీకరవైరిదారణవి ♦ వేక కృతార్థ! యశోద నెమ్మితో
గోకులమందుఁ గన్న పసి ♦ కూన భవత్కరముం ద్యజించి వే
యాకస మొందినట్టి కథ ♦ యంత యెఱుంగుదు వీవు దేవరా! ౬

ఉ॥ భూవర! పూర్వపుణ్యమునఁ ♦ బుట్టిన యీ వసుదేవుఁ డాస్థతో
దేవకియందుఁ గృష్ణు, బల ♦ దేవుని రోహిణియందుఁ గాంచియున్
నీవలనన్ భయంపడుచు ♦ నెచ్చెలియా వ్రజనాథు చేతిలో
దీవిగఁ బెంచుమా! యని యి ♦ డెన్ దదనంతరమందు వారలున్. ౭

ఆ॥ శుక్లపక్షచంద్రు♦శోభను బెరుఁగుచుఁ, బూతనయను నసురి♦మొదలుకొనియు
నల యరిష్టుఁ డనెడి ♦ నసురువఱకుఁ గల, రక్కసులను జంపి ♦ నిక్కరయ్య! ౮

చ॥ ఇరువురు వీరు వైరులని ♦ యీ వెద నమ్మి మెలంగుమా! యనన్
సరగ బలిష్ఠకంసుఁడు న ♦ సాధ్య దురాగ్రహాకంపితాంగుఁడై
కరమున శాతఖడ్గమును ♦ గైకొని యా వసుదేవుఁ దత్సభన్
నఱుకఁగఁ బోయి నారదు వచ ♦ నంబున నాగియు నెట్టకేలకున్. ౯

తే॥ ఆలితోఁగూడ నాతని ♦ హస్తములకు, సంకెలల వేసి వెసఁ జెఱ♦సాలఁ బెట్టె
నంత నటనుండి నేఁబోతి♦నవల నతఁడు, రామకృష్ణవినాశనా♦రంభ మరసి. ౧౦

తే॥ దనుజవరుఁడగు కేశినిన్ ♦ దానె పిలిచి
రామకృష్ణులఁ ద్రుంపఁగా ♦ వ్రజము జనుమ!
యంచు నంపి చాణూరము ♦ ఖాసురులను,
మంత్రులన్, నిజకరిమహా ♦ మంత్రిఁ జీరి. ౧౧

ఉ॥ వీరవరిష్ఠులార! సర ♦ విన్ వినుఁడీ! మునివర్యుఁడైన యా
నారదుఁ డిట్టి నన్ను నల ♦ నందగృహస్థిత రామకృష్ణులే
పోరునఁ జంప నుండిరని ♦ పూర్తిగఁ దెల్పెను గాన వారలన్
మీ రిట మల్లయుద్ధమున ♦ మిత్తికొసంగుఁడి! గెల్పుఁ దెల్పుఁడీ! ౧౨

ఉత్సాహ॥ మల్లభూమి శుభకరముగ ♦ మసలకుండఁ జేయుడీ!
యుల్లలన్మదాంబుధార ♦ నుబ్బు నా గజంబుచే
నల్ల నల్లిఁ ద్రొక్కినట్టు ♦ లణఁగఁ ద్రొక్కఁ జేసి వా
ర్జెల్లుకాఁగ మావటీఁడ! ♦ చేయుమయ్య! చయ్యనన్. ౧౩

క॥ అమవసపవలున మల్లర, ణమగుర్ దత్పూర్వదినము • నర్ గార్ముకయ
జ్ఞమును బ్రశాంతము కొలిపి కై, క్రమముగ జరిపింతు•గాన • రండటకీరల్. ౧౮

ఉ॥ వారికి నీ రహిర్ బలికి • పంపి రహస్యముగా మనీషి న
క్రూరుని నంతరంగు నను • కూలుని మంత్రిని బిల్చి యిట్లనెర్
ఘోరను రామకృష్ణులను • పోఱలు నన్దెగటార్తు రంచు నా
నారదమౌని యిత్తఱిని • నాకునెఱుంగ•గ• జెప్పె• గావునర్. ౧౯

కంసుం డక్రూరుని గోకులంబున కంపుట.

తే॥ ఎల్లి వేకువ గోకుల • మేగి యందు, నున్ననందునిగీమున • వెన్ను•డతని
యన్నయుండిన నీవార్త • లన్ని జెప్పి, యమృత మొల్కెడి పల్కుల • నాడి వేడి.

క॥ పృథులోపాయన భరితుల•, బ్రథితుల నందాదిగోప • రాజుల మధురా
విధసందర్శన మిషచే, రథముల నెక్కించుకొనియు • రమ్మక్రూరా! ౧౭

మహాస్రగ్ధర॥ వినుమాదిర్ రామకృష్ణుల్ • విదితకువలయా•పీడనాగంబుచే•గా
ని నిరాఘాటంబుగా నా • నిరతిశయబల • స్నిగ్ధమల్లాళిచే•గా
ని నిమేషంబందు• జావర్ • నిరుపమ విధులర్ • నేనొర్తు బ్రజేశు
న్వెనుకర్ సీల్గర్ బొనర్తుర్ • నెన రెద విడి యో•స్నేహితాళ్యగ్రగణ్యా!

తే॥ పైని నావృష భాసుని • భంగపరతు•, బిదప నందోపనందుల • పీచమడ•తు
నంత నానకదుందుభిర్ • హతమొనర్తు, వానిసఖు•డగు దేవకు • వధమొనర్తు.

తే॥ మఱియు రాజ్యసముత్సుకు • విరసు న్నుగ్ర, సేను•బరిమార్తుయాదవ•సేన నంత
నంత మొనరింతు సంశయ • మందవలదు, వీరు ప్రాగ్జనిర్ సురలని • విశ్వసించు.

సీ॥ భూత భేతాళాది • నేతయు వీరసం, స్తవ్యుండు భూతీసం • తాపనుండు,
కింకయేవచ్చిన • శంకరునైతము, సంకటపడ• జేయు • సంకరుండు
పట్టుబట్టిన నట్టి • ప్రలయకాలుని• గూడ, నణ•ప•జాలినద్వివి • దాభిదుండు
ముక్కంటినింగూడ • మొగసాల కాపరి, గా సల్పినట్టి బా • ణాసురుండు

తే॥ వృకనిశాట, హరిశ్మశ్రు • హృష్ట నరక, కాలనాభ, మహానాభ,•కర్బురులును
మిత్రులౌచు మదర్థమై • మేడమందు•, బ్రాణముల నియ్య సిద్ధులై•వఱలిరయ్య!

క॥ ధనియును ధన్వియు బలియును, దనుజామరమనుజవరుల• • దనమాటకు లొం
గిన వారినిగా• జేయుచు, మనెడి జరాసంధు•డరయ • మామయ కాదే. ౨౨

ఉ॥ అరయ నేను యీజగతి • యందలి గండరగండులర్ గరం
బూరును బేరులేని యటు • లుగ్రతనాశ మొనర్చి యీ యకూ
పారవృతావనీస్థలము • పాలనసేయుచు నుంటి సర్వ బృం
దారకులర్ బిడౌజు ద్రుటి• • ద్రాళ్ళను గట్టి జయించితిర్ గదా. ౨౩

తే॥ వెండియుఁ గ్రద్రవ్యపతినిఁ గు♦బేరు మేరు, గిరిగుహామహాదుర్గమం♦దణచుచుండఁ
ద్రోసియుంటిని త్రైలోక్య♦భాసమాన, రాజ్యలక్ష్మిని గైకొంటిఁ♦బ్రణుతచరిత!

క॥ అకుతోభయుఁడను జుమ్మీ, యిఁక నాకును నాచెలులకు ♦ నెది యవళంబై
సుకములఁ గూర్పఁగ జాలదొ?, ప్రకటింపుము కొఱతలేని ♦ రహి నక్రూరా!

తే॥ కవిజనముల యం దీవె♦కవివరుఁడవు, చతురమతులందు నా బృహ ♦ స్పతివినీవు
గాన నెదిచేయఁదగు? నన ♦దానలలితుఁ,డైన యక్రూరుఁడతనికి♦ననియె నిట్లు.

తే॥ మీరు పలికిన పలుకులు♦మేలుగూర్చు, నవిగ నున్నవి కాని యి ♦ య్యదిదలంప
దైవయత్నము చేతఁ♦గాఁ దగునుగాని, మనప్రయత్నముచేతఁ♦గాఁ దనఁగ వినుచు.

శా॥ కంసుం డిట్లు వచించె దానలలితా! ♦ కావించినన్ యత్నము
త్తంసుల్ మెచ్చఁ గ్రియావళుల్ సఫలమై ♦ దైవారవే దైవమే
శంసార్హంబని నమ్మి పౌరుషబల ♦ స్థైర్యాదులన్ వీడినన్
హింసల్లగ్గవె? మిన్నకుండిన గదల్ ♦ హెచ్చిల్లి వేధింపవే? ౨౮

ఉ॥ కాలము దైవరూపమని ♦ గట్టిగ నమ్మిన కర్మయోగి యే
మూలనొ యుండుగాత బల ♦ ముల్ జలముల్ మతిలేని వెంగలుల్
వీలుగ దైవమే వరము ♦ విశ్వసనీయ మటంచుఁ జెప్పగాఁ
జాలుచు నుండ్రుగాత దృఢ ♦ శక్తిసమేతుఁడు దానినొప్పునే. ౨౯

ఉ॥ కావున తేపు గోకులము ♦ కంజహితోదయపూర్వవేళలో
నీవు బిరాన సాగుమని ♦ యేపున నొక్కి వచించి పంపి యా
సేవకజాలముల్ బనిపి ♦ చీదఱవద్ద మనంబుతోడ ర
త్నావృత పీఠికన్ విడిచి ♦ యంతిపురంబున కేగె భూవరా! ౩౦

## వాసుదేవుండు కేశినిశాచరుం ద్రుంచుట.

చ॥ పదపడి కంసునానతి జ ♦ వంబున నేగిన కేశిదైత్యుఁడున్
మదమున నశ్వరూపమును ♦ మానుగఁదాల్చి వ్రజంబు జొచ్చి యం
బుదము విధాన బొబ్బలిడి ♦ పుచ్ఛహతిన్ ఘనపంక్తి నింగి యం
దదవదలౌనటుల్ సలిపి ♦ యంఘ్రిహతిన్ ధరఁగూల్చెఁ జెట్టులన్. ౩౧

ఉ॥ ఆసమయంబునందు వ్రజ ♦ మందు నివాసముఁ జేయు గోప గో
పీసముదాయ మాయసురు ♦ భీకర చర్యలఁ గాంచి భీతులం
దాసల వీడి మాధవుని ♦ యండకుఁ జేరుచు దిక్కు కమ్మనం
గా సరి యంచు నొప్పికొని ♦ కంజదళేక్షణుఁడూరడించుచున్. ౩౨

పంచచామరము॥ తటాలునన్ గటిన్ బటంబుఁ దద్దఁగట్టి దైత్యుపై
ఘుటా ఘుటిన్ జనంగ నా న ♦ రోదనుండు శ్రీహరిన్

బటుత్వయుక్త దీర్ఘ వామ • పాదఘాత బాధితుఁ
డ్రుటిఁ బొనర్చి యార్చె నింగి • ద్రోఁగ భూమి వ్రయ్యఁగన్.

మ॥ అటుపై శ్రీధరుఁ డాగ్రహించి నిజహ • స్తాగ్రంబుచే వానిఁ జి
వ్వటతాటంబుగఁ బట్టి త్రిప్పి యువియ • ద్వీథిన్ జతుః క్రోశముల్
త్రుటిలోఁ దాఁట గిరాటు వేసె నవలన్ • దోషాచరోత్తంసుఁడు
త్కటకోపంబునఁ దిర్గివచ్చి తనతోఁ • గన్ మోఁదె దామోదరున్. ౩౮

వ॥ అంతనా దైత్యాంతకుండు ప్రలయాంతకు భంగిం గనలి యా రేఁద్రిమ్మరీని వాలంబుఁ గేలం దాలిచి గిరగిరం ద్రిప్పి యప్పరపీఁదియందు వందయోజనంబులపైఁ బడునట్లు విసర నయ్యసురుం డసువుసురై క్రమ్మఱ లేచి ధారాధరంబు కరణి నార్చి పేర్చి జూలును, రోమస్తోమంబును విదలించుకొని కార్చిచ్చు గ్రమ్మిన యక్కమలాక్షు సమక్షంబునఁ బాదంబులన్ మేదినిం ద్రవ్వుచు నా బాలకృష్ణుం గొని విహంగంబు భంగి నింగి కెగయుచు దిగుచుఁ దిరుగుచు మిగుల బాధింపం దొడంగె. అంత శిష్టరక్షకుండగు నా శ్రీహరి యాశిష్టపుష్టినష్టకరంబగు నొక ముష్టితో నా దుష్టనిశాటుం బ్రహరింప నతండు రెండుగడియల కాలంబు గడబట్టి తిరుగఁ దెరలి యా హరిని దన కంధరంబునఁ దగిలించుకొని చదలున కెగసి లక్ష యోజనంబు లుల్లంఘించె. అపుడందు గోవిందుఁ డా దుండగీని పాదసటాపుచ్ఛ ఖురంబులతో నఖండంబగు భండనంబు రెండుజాములొనర్చి నిజభుజంబుల నవ్వానిం గైకొని యుయ్యేల నూఁచినపగిది నట్టిట్టూఁపి యటనుండి క్రిందఁ బడవైచి యొక బుజంబు తదాస్యంబందుఁ జొప్పించె. అంత నది యుపేక్షించిన యామయంబు విధంబునఁ గ్రమక్రమంబుగాఁ బెరుఁగుచు నా యసురోదరంబును బ్రవేశించి కలంచఁ గని తగినట్లా రక్కసుండు తన కుక్షిం బ్రబలంబుగా నొనర్పం గడంగ ఖండితోదరుండై మృతుండయ్యె. అయ్యవసరంబున నయ్యశ్వశరీరంబునుండి కిరీటహార కేయూరకంకణకింకిణీకాంచీసమంచితంబగు దివ్యరూపంబు ధరించిన యొుకండు పురుషుండు నిర్గతుండై యా భక్తవత్సలునికిం బ్రణమిల్లి సాంజలియై యిట్లనియె.

## కేశిపూర్వజన్మవృత్తాంతము.

తే॥ దేవ! శక్రానుచరుఁడను • దివ్యరూప, ధరుఁడ, దేజస్వి వర్చస్వి • దత్త్వవిదుఁడఁ
గుముదనామకుఁడన్ నేను • గొడుగుబట్టి, యింద్రుమెప్పించి జీవింతుఁ • గృష్ణ! తొల్లి

తే॥ అపుడు దేవేంద్రుఁ డట్లు వృ • త్రాసురవధ, సల్పి తద్బ్రహ్మహత్యాది • శాంతికొఱకు
సర్వసవనోత్తమంబును • స్వస్తిదంబు, నైన యశ్వమేధంబు స • మాచరింప

తే॥ శ్యామ కర్ణాంచితము మనో • జవయుతంబు,
శుభ్రవర్ణ సంయుతమును • శుభకరంబు

నైన హయమును విడువంగ ♦ దానిఁ దస్క
రించుకొని యెక్కి తలమున ♦ కేగియుంటి. ౩౮

ఉ॥ అత్తఱి నింద్రుఁ డుర్వి దివిష ♦ దావళితోఁ జనుదెంచి నెత్తిపై
మొత్తుచుఁ ద్రాళ్ళఁ గట్టి హయ ♦ ముం గొని దుర్మతి! తేజిరూపుతో
హత్తు నిశాచరుండవగు ♦ మామనుయుగ్మ మటంచు శాపముల్
జిత్తమునన్ దయారసముఁ ♦ జేర్పక నాకిడె నబ్జలోచనా! ౩౯

ఉ॥ దాన హయస్వరూపవృత ♦ దైత్యుఁడనై చరియించుచుంటి నో
దానవవైరి! నీదయను ♦ దత్కృతనాయక శాప మిత్తఱిన్
నేను విడంగఁ జాలితిని ♦ నిశ్చయ మియ్యది భక్తవత్సలా!
దీనశరణ్యా! దేవనుత! ♦ దేవ! నతుల్ బొనరింతు భక్తితోన్. ౪౦

చ॥ అని ప్రణమిల్లి సల్గడల ♦ సద్భుతరోచులఁ బర్వుచున్ మహా
ఘనమగు విష్ణులోకమును ♦ గాంతిసమన్వితమౌ విమాన మం
దున వెసనెక్కి చేరెను వి ♦ ధూతరిపూత్కర! తత్పరంబునన్
దనరిన సంగతుల్ వలికె ♦ దన్ వినుమో బహులాశ్వభూవరా! ౪౧

అక్రూరుండు గోకులంబున కరుగుట.

తే॥ కంసునాజ్ఞ నక్రూరుండు ♦ ఘనరథంబు, నెక్కి గోకులంబున నేగు ♦ చక్కజమగు
గిరుల దరుల సరిస్సులఁ ♦ దరుల విరులఁ, గాంచు చలరుచుఁ జను చిచ్చ ♦ నెంచె నిట్లు,

క॥ నయముననో భయముననో, ప్రియముననో వైరముననొ ♦ విష్ణుని బలునిన్
రయమునఁ దోడ్కొని రమ్మని, నియమించిన యట్టికంసు ♦ నిత్యముఁ గొలుతున్

ఉ॥ ఏమితపంబుఁ జేసితినొ ♦ యే మహనీయునిఁ గొల్చియుంటినో
యేమిజపంబొనర్చితినొ ♦ యెట్టి వ్రతంబుల నోచియుంటినో
యేమిసుఖంబు ధాత్రికి ఘ ♦ టించితినో కద! యీదినంబునం
దా మధువైరి నా స్వభువు ♦ నా హరినిం గను భాగ్యమబ్బెఁగా. ౪౪

ఉ॥ కాని మదాగమంబు విని ♦ కంసుని పంపున వీఁడు వచ్చె న
ద్దాన నితండు వధ్యుఁడని ♦ దానవహంత సమీకరంతమై
మానసమందు నెంచి పరి ♦ మార్చునొ? చెల్మిని గద్దెనిచ్చి స
మ్మానముఁ జేయునో మఱియు ♦ మద్విధి యెవ్విధి నివ్వటిల్లునో. ౪౫

ఉ॥ ఎట్టులనైన నేఁడు కమ ♦ లేశుఁ గనుంగొను భాగ్య మబ్బె నా
యట్టి కృతార్థుఁ డీ జగతి ♦ యందుఁ జెలంగునె? పట్టుపుట్టముల్
గట్టెడిజెజె యే నరుల ♦ కన్నుల గోచరుఁ డౌనొ వారు బ
ల్చెట్టలు నైన ధన్యులయి ♦ శ్రీధరుఁ జేరరె? యంతరంగమా! ౪౬

ఉ॥ ఈరహి శౌరినిం గుఱిచి ♦ యెంచుచు సచ్ఛకునంబులంగాంచి య
క్రూరుఁడు గాందినీసుతుఁడు ♦ గోకుల మర్కుఁడు గ్రుంకువేళలోఁ
జేరి యవాంకుశాంబుజ వి ♦ శిష్టజనార్దన పాదచిహ్నయు
గ్ధారణిఁగాంచి డిగ్గన ర ♦ థంబును డిగ్గి మనోరథంబునన్. ౮౭

తే॥ పొరలి యానందబాష్పము ♦ ల్బొరల విడిచి
నందు మన్కికి నరుగంగ ♦ నందునుండి
బలునిఁ గూడిన కృష్ణుండు ♦ వచ్చుచుంటఁ
గన్నులారఁగఁ గనుఁగొని ♦ గాఢభక్తి. ౮౮

సీ॥ పురుషోత్తములను నం ♦ భోజలోచనులను, శ్యామలగౌరవ ♦ ర్ణాంచితులను
లీలాపరులఁ బీత ♦ నీలాంబరధరుల, బాలుర గోజాల ♦ పాలకులను
మకుటలలంతికా ♦ మంజీరకంకణ, హారకేయూర స ♦ మన్వితులను
యోగిరాడ్దేవరా ♦ డురగరాణ్ణుతులఁ బు,రాణుల భక్తసం ♦ త్రాణరతుల
తే॥ నిర్జితానంగరూపుల♦దుర్జనగణ, తర్జనాత్యూర్జిత బలుల ♦ దుర్జయులను
నార్జవార్జిత యశులను♦హరి బలులను,డాసి పదములంబడి నతుల్♦జేసె నవల.

క॥ శౌరియు రోమాంచితునిన్, వీరుని నానందబాష్ప ♦ విలసన్ముఖు న
క్రూరుని నక్రూరునిఁ గని, కారుణికత్వార్ద్రి నయన ♦ కమలుండగుచున్. ౯౦

చ॥ పదములనుండి హస్తములఁ ♦ బట్టుచు లేవఁగఁదీసి యింటికిన్
ముదమునఁదోడుకొంచుఁజని ♦ ముద్దగు గద్దియ నిచ్చి మంచిగాఁ
గుదిరిన భక్ష్యభోజ్యముల ♦ గోవుముఖంబునఁ బెట్టి భూవరా!
పదపడి గాందినీతనయు ♦ ప్రక్కకు నందుఁడు సేరి యిట్లనెన్. ౯౧

ఉ॥ సిగ్గును వీడి భోజపతి ♦ చిన్నల నల్లురఁజంపెఁ జెల్లఁబో!
మెగ్గులఁగూర్చెఁ జెల్లెలకు ♦ నేమియెఱుంగని వారినిం జెఱన్
బగ్గను బెట్టె న్యాయముల ♦ వంబు దలంపక యింక నెవ్వరిన్
నుగ్గొనరింపఁ జూచెడినొ ♦ న్యూనతలేని యటుల్ వచింపుమా! ౯౨

తే॥ అట్టిచెట్టరాజ్యమునందు♦నెట్టులీవు, బ్రతుకుచుంటివొ యక్రూర!♦పలుకుమయ్య!
యనుచు గేహములోనికి ♦ నరిగెఁ బిదప, హరియు గాందినీపుత్రకు♦నడిగెనిట్లు.

ఉ॥ సేమమె మీరు మీపురినిఁ ♦ జిన్నలుఁ బెద్దలు స్త్రీలు పూరుషుల్
సేమమె? నీవె సాగుతటెఁ ♦ జేరుచు నాతలిదండ్రు లాదటో
నేమి వచించి రాత్మజన ♦ మేవెతలన్ బడకుండెనొక్కొ? యిం
కేమిదలంచెఁ గంసుఁడిపు ♦ డెల్లజగంబులు క్షోభఁజెందఁగాన్. ౯౪

ఉ॥ నావుడు గాందినీసుతుఁడ ♦ నందొడఁగెన్ బరమాత్మ! మొన్న భో
జావనిజాని, మానమున ♦ నాసభయందుఁ గృపాణపాణియై

